# తీరిన భయం

[కథల సంపుటి]



డా॥ ఎస్. గంగప్ప, ఎం.ఎ, పిహెచ్ డి.

తీరిన భయం
[కథల సంపుటి]

రచన :
డా॥ ఎస్. గంగప్ప, ఎం.ఏ., పిహెచ్.డి.,
రీడర్, తెలుగుశాఖ,
నాగార్జున విశ్వవిద్యాలయం,
నాగార్జున నగర్ – 522 510, గుంటూరుజిల్లా.



ప్రథమ ముద్రణ : ఏప్రిల్, 1985

ప్రతులు : 1000

వెల : 6/-

ప్రతులకు :
శ్రీమతి ఎస్. పార్వతమ్మ,
శశి ప్రచురణలు,
పి-73, శ్రీనివాసనగర్ కాలనీ,
గుంటూరు-522 006.

ముద్రణ ; వైష్ణవి ప్రింటర్స్, గుంటూరు-1, ఫోన్ : 25383

# విషయ సూచిక

# కృతజ్ఞతలు

నా రచనా వ్యాసంగానికి నాంది నాకథ 'తీరిన భయం'. నా రచనలన్నింటిలోను మొదట అచ్చయిందీ అదే। అందుకే నాకథల సంపుటికి 'తీరిన భయం' అనే పేరేఉంచాను

పరిశోధనే నా పరమలక్ష్యమైనా నాలోని సృజనాత్మక పద్య, గేయ, నవలా, నాటక, నాటికలలాగే నాయీ కథలరచనకు ప్రేరణ. సమాజంలోని సన్నివేశాలు, వ్యక్తులూ ఇందులో కనిపిస్తారు. వాస్తవికపు భ్రాంతి కళ గదా। నా యీ కథల్లోను ఇది స్పష్టమవుతుంది

కొన్నికథలు పత్రికల్లో ప్రచురితం. 'కానుక' రేడియోలో ప్రసారమైంది. ఆయా అధిపతులకు నా కృతజ్ఞతలు।

రచన ఒక ఎత్తు, అచ్చువేయించడం మరో ఎత్తు. నాయీ కథల సంపుటి ముద్రణార్థం దయతో కొంత ఆర్థికసహాయంచేసి పుస్తకరూపంలో రావడానికి తోడ్పడిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల శాఖవారికి_నా కృతజ్ఞతలు।

మొదట ఆంధ్రప్రభ_సచిత్ర వారపత్రికలో శ్రీ శంకర్ చిత్రించిన బొమ్మకు నమూనా ముఖచిత్రంగా చిత్రించిన మిత్రుడు శ్రీ పి.నాగుల్ (మంగళగిరి)కీ, అనుమతించిన ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికవారికీ నా కృతజ్ఞతలు।

ఎప్పటిలాగే నా యీ పుస్తకాన్ని ముచ్చటగా ముద్రించి ఇచ్చిన మిత్రులువైష్ణవి ప్రింటర్స్ అధినేత శ్రీ భవిరిశెట్టి రాజేంద్రప్రసాద్‌గారికీ, వారిసిబ్బందికీ _ నా అభినందనలు।

డా॥ ఎస్. గంగప్ప.



శ్రీ ఏ. చెంగప్ప, I. A S.

గుంటూరుకు వచ్చినారునొక మండలాధిపతులు
గుణగరిష్ఠపాలనాదక్షులు మీరు, వారి కర్తవ్యములు

సౌమ్య మృదులహృదయులు
సరససాహిత్యాభ్యుదయులు

ఆవుల వంశోదధిచంద్రులు
అపరిమిత గుణకీర్తి సాంద్రులు

చెంగప్ప నామధేయులకు
చెంగలువల రాయలకు

అంకితం నా 'తీరిన భయం' !
అలరించు కథా కళాలయం !

డా॥ ఎస్. గంగప్ప.

# తీరిన భయం

"శాంతా! శాంతా!" అంటూ పిల్చారు హడావిడిగా బజారునుంచి తిరిగివచ్చిన సీతారామయ్య. "వస్తున్నానండి" అంది శాంతమ్మ లోపల్నుంచియే. సీతారామయ్య ఈజీచైర్లో విశ్రమిస్తూండగా శాంతమ్మ వచ్చింది.

"పిల్చారాండి."

"ఊఁ! ఇంకా ఏంజేస్తున్నట్లు? ముహూర్తం దాటిపోతుంది."

"అంతా తయారైనట్టే. అమ్మాయిని ముస్తాబుచేస్తున్నాం."

"తొందరగాకానీ ముహూర్తం దాటిపోతే ప్రయోజనమేమి?"

"నిజమేగాని, ఎందుకో నాకు భయంగా ఉందండి."

"ఓసి పిచ్చిదానా! నీళ్ళలో నిండామునిగినాక చలేమిటి? గాలేమిటి? అంతటికీ భగవంతుడే ఉన్నాడు. ఏమొచ్చినా అనుభవించాలిగదా? ఇంత అనుభవించాం. ఇక .... ....

"ఆఁ! మీమెట్టవేదాంతం కేంలెండి. అనుభవించే వాళ్ళకి తెలుస్తుంది బాధ."

"బావౌను. అంతా నీవే అనుభవించినట్టు!"

"కాదనుకోండి. మీరుమాత్రం? పాపం! .... .... ...."

"ఆఁ! ఇకచాలుకాని మాటల్లోబడి అసలు విషయం మరిచిపోతున్నావ్."

"కాదండి. పర్యవసానం ఎట్లుంటుందో అని నాగుండె దడదడలాడిపోతూంది. సరే"— వెళ్ళిపోయింది శాంతమ్మ. "అంతటికీ భగవంతుడే ఉన్నాడు." నిట్టూర్చి అన్నాడు సీతారామయ్య.

జాలు. పక్కన తోటలోంచి చల్లని గాలివీస్తుంది. ఈరోజే డాక్టర్ సుందరం జీవితంలో రెండోఅధ్యాయం ప్రారంభం. నవవికసితకుసుమగుచ్ఛం ఉంది చేతిలో. కిటికీదగ్గర నిల్చుండి చందమామను తిలకిస్తున్నాడు డాక్టర్. సర్వజనాహ్లాదకరమూ, నిసర్గమనోజ్ఞమూ అయిన చందమామలోగూడ ఎందుకో కళంకం? ఏ వస్తువుగూడ స్వయంసంపూర్ణంగా ఉండదు అదే ప్రకృతిలోని వైచిత్ర్యం. ఇది జ్ఞాపకముంచుకొంటే ఎవరిని ఎందుకు మనం నిందించాల్సిన పనేలేదు. ఒకవ్యక్తి కురూపిగాగాని, వికలాంగుడుగా గాని ఉన్నాడంటే అది ప్రకృతినైజం. అందరూ ఒకేవిధంగా ఉండరు. గదా? వృత్తిరీత్యా డాక్టర్ సుందరం వికలాంగుల్ని ఎంతోమందినిచూశాడు. అందులోను డాక్టర్ 'ఐ స్పెషలిస్టు'. చేతపట్టిన ప్రతి కేసువిషయంలోను శక్తివంచనలేకుండా పనిచేసేవాడు డాక్టర్ బాగుపడిన వాళ్ళెందరో హృదయపూర్వకమైన జోహారులర్పించాడు డాక్టర్‌కి తనకృషి ఫలించనిపట్ల కన్నీటిబొట్లురాల్చేవాడు డాక్టర్. నిజంగా మూర్తీభవించిన దయ డాక్టర్. పెళ్ళిచూపులనాడే సుశీల సౌందర్యానికి ముగ్ధుడైపోయాడు డాక్టర్. ఆమెపొందు నిజంగా తనపూర్వజన్మ సుకృతఫలమనుకొన్నాడు ఇంతవరకు ఒకరినొకరు పలకరించుకోటానికి అదను లభించలేదు. ఇంకా రాలేదేమా అని తహతహలాడుతున్నాడు. ఒక్కసారిగా పూసగ్రుచ్చినట్లు తన భావాలన్నీ నివేదించుకోవాలనుకొన్నాడు. ఆ అపూర్వ సన్నివేశంకోసం ఎదురుచూస్తున్నాడు డాక్టర్,

"సుశీలా! రామ్మా! ఆలస్యమౌతుంది. మీనాన్నగారప్పుడే అరిచారు."—అంటూ సుశీల చెయ్యిపట్టుకొని పిలిచింది కాంతమ్మ. మౌనంగా కదిలింది సుశీల. వెంట ఇద్దరుముగ్గురు ముత్తైదువలుగూడ ఉన్నారు. పెళ్ళికాక పూర్వం అమ్మాయినిచూస్తే గుండె చెరువైపోయేది. ఇప్పుడు సుశీల నొక ఇంటిదాన్ని చేశాంగదా అని హృదయం తేలికపడుతూంది. కాని

అదే హృదయంలోనే పెనుతుఫాన్‌గూడ రేగుతూంది తమ కుటుంబపరిస్థితి ఏవిధంగా పరిణమిస్తుందో అని ఒకటేబెంగ. విధివిలాసం! కానున్నది కాక మానదు! 'అంతటికీ ఆ భగవంతుడే!'

"మీరంతా నిలవండమ్మా! అమ్మాయిని వదలిపెట్టివస్తా"_అంది ముత్తైదువలతో శాంతమ్మ శోభనపుగది దగ్గరికి వచ్చినాక నడుస్తూన్నదల్లా శాంతమ్మని బిగ్గా కౌగిలించుకొని 'అమ్మా' అంటూ బావురమని ఏడ్చింది సుశీల. వస్తున్న దుఃఖాన్నంత దిగమింగి, లేనినగవు తెచ్చిపెట్టుకొని అంది శాంతమ్మ "పిచ్చితల్లీ ఆనందించాల్సిన సమయంలో దుఃఖిస్తావా? ఏడవకమ్మా. మా అమ్మగదా!" అనునయించింది శాంతమ్మ సుశీల కళ్ళజోడు తీపి ధారగా ప్రవహిస్తూన్న కన్నీళ్ళు తుడుచుకొంటూండగా "బొనమ్మా సుశీల! నీకేంతక్కువ? నీభర్త పేరుమోసిన డాక్టర్. దయామయుడు. తప్పక నిన్ను చేరదీస్తాడు. నీజీవితం సుఖవంతం కాగలదు. ఏడవకమ్మా" అందొక ముత్తైదువ. శాంతమ్మకు తెలీకుండానే కన్నీళ్లు కారిపోతున్నాయి. శోభనపుగదిలోకి ప్రవేశించింది శాంతమ్మ సుశీలతో. వీణ దగ్గరికిపోయి ఆగిపోయింది శాంతమ్మ. మళ్ళీ బిగ్గరగాఏడ్చింది సుశీల. తోటవైపు తిరిగి చందమామని తిలకిస్తూ ఊహాగానంలోఉన్న డాక్టర్ సుందరం అయేడుపు విని గిరుక్కున తిరిగాడు. సుశీల ఏడుస్తూంది శాంతమ్మ అనునయిస్తూంది. చెప్పవలసినది చెప్పి "ఇదిగోమ్మా! వీణ నీకుడిచేతి పక్కనే ఉంది. నేను వెళ్ళవస్తానమ్మా" ఇంకేమీ అనలేక వెళ్ళిపోయింది శాంతమ్మ ఈమాటలు పూర్తిగావిన్నాడు డాక్టర్ సుందరం. బయట గొళ్ళెంపెట్టిన శబ్దం.

దుఃఖాన్నంతా దిగమింగింది సుశీల. వీణ తీసుకోబోయింది. చేతులు తడబడ్డాయి కొద్దిక్షణాల్లో తీసుకోగల్గింది. ఈ విషయాన్ని గమనించాడు డాక్టర్. పాపం! సుశీల ఏడుస్తూండగా ఓదారుద్దామనుకొన్నాడు డాక్టర్.

అడుగు ముందుకువేసి ఆగిపోయాడు. కారణం వీణవాయిస్తుంది సుశీల. దానికంతరాయం కలుగుతుందేమో అని ఆగిపోయాడు వీణవాయిస్తూ శ్రుతికలిపింది. అసలే అది తంజావూరివీణ. కమ్మని మధుస్వరం దానికి తోడైంది. ఆ సంగీతంవింటే శిలలుగూడ ద్రవించిపోతాయేమో అని పించింది డాక్టర్‌కి. ఇలాంటి శుభసమయంలో ఆనందవార్ధిలో మునిగితేలాం డాలిగాని ఏదోబాధ, ఏదో భయం, ద్వైధీభావం వహించి వినవస్తుందాపాట. ఎందుకో భయం? ఏమో? వీటినిమించి శ్రవణపేయంగా ఉలదాపాట. ఆ మృదుమధురగానం సమ్మోహనాస్త్రంవలె పనిచేసింది డాక్టర్‌మీద. తన్మయుడైపోయాడు. ఉన్నవాడున్నపళంగా నిల్చిపోయాడు చిత్తరువులోని బొమ్మమల్లె. మళ్ళీ ఈలోకంలోకి వచ్చేసరికి ఎప్పుడాగిపోయిందో ఆపాట తనకేమీ తెలీదు. నిజంగానే తనజన్మ ఫలించిందనుకొన్నాడు డాక్టర్.

దగ్గరికివెళ్ళుతూ "ఎక్సెలెంట్! మార్వలస్! సుశీ!" అనకుండా ఉండలేకపోయాడు డాక్టర్ వెంటనే లేచినిలబడింది సుశీల. "ఈ గులాబీ పువ్వెంత అందంగాఉందో చూశావా సుశీ?" అన్నాడు డాక్టర్. సమాధానం లేదు దుఃఖిస్తూంది సుశీల. ఇక సమాధానంరాదనే ఉద్దేశ్యంతో ఆలేత గులాబీపుష్పాన్ని జడలో తురిమాడు డాక్టర్. ఒక్కసారిగ ఒళ్ళుగగుర్పాటు చెందాయి సుశీలకి. స్త్రీ సహజమైన సిగ్గు, అనిర్వచనీయమైన భయం, దానివలన కలిగిన దుఃఖం—సుశీలలో ముప్పిరిగొన్నాయి. కంపించిపోయింది. ఆపాలని ఎంత ప్రయత్నించినా ఆగని కన్నీటిధార. "సుశీ! ఏమిటా కంపనం? ఎందుకాభయం? అవి మోద బాష్పాలో, ఖేదభాష్పాలో నిర్ణయించ లేకుండా ఉన్నాను."—అన్నాడు ఆశ్చర్యచకితుడైన డాక్టర్. కళ్ళజోడుతీసి కన్నీళ్ళుతుడుచుకొంది సుశీల ఏదో చెప్పాలని ప్రయత్నించింది. పెదవులు అల్లలాడిపోయాయి కాని చెప్పలేకపోయింది. ఆ భావాలేమిటో పెదవుల కవతలే దాగిపోయాయి.

"సుశీ! మొదటి రాత్రికనుక, అద్భుతమైన నెక్లెస్. ఇదిగో బాగుందా ?"—అడిగాడు డాక్టర్. సమాధానంగా దుఃఖం పెల్లుబికివచ్చింది. మాట్లాడలేకపోయింది. కొద్దిక్షణాలు మౌనంగా ఉన్నాడు డాక్టర్. నెక్లెస్‌ని మెళ్ళో అలంకరించాడు. గడిగడియకి పెరుగుతున్న అతని ఔన్నత్యాన్ని దయాస్వభావాన్ని తెలుసుకొంటున్నా సుశీల హృదయంచాల మథనపడింది. ఆందోళన యెక్కువౌతుంది "సుశీ! ఏదో చెప్పదలచి ఆగిపోయావ్. చెప్పు. నాదగ్గరెందుకు దాపరికం ?" బుజ్జగిస్తూ, సుశీలచేతుల్ని తన చేతుల్లోకి తీసుకొంటూ అడిగాడు డాక్టర్. వెక్కివెక్కి దుఃఖిస్తూంది సుశీల.

"నీవు దుఃఖిస్తూంటే నాకెలాతెలుస్తుంది నీమనోభావం ? సుశీ ! నీకేమీ భయమక్కర్లేదు. నీవు నాదానవి నీకేలోటు రానీను. నీబాధేమిటో చెప్పు. అటు కూర్చుందాంరా". అంటూ మంచంకేసి నడిచాడు డాక్టర్. కాని సుశీలమాత్రం కదల్లేదు. బహుశా సిగ్గుపడుతోందేమోనని మంచం దగ్గరికి సుశీలని తానే తీసుకుపోయాడు ఇద్దరూ దగ్గరదగ్గరగా కూర్చున్నారు మంచంమీద

"నాతో మాట్లాడేందుకిష్టంలేదా ? లేక నీకిష్టంలేకపోయినా మన పెళ్ళి జరిగిందా ? ఏమిటోచెప్పు సుశీ !" అన్నాడు డాక్టర్. ఇంకమౌనంగా ఉండలేకపోయింది ప్రయత్నించింది. పెదవులు వణకాయి. "అ....ది.... కా....దం....డీ" అంది చాల ప్రయత్నంతో. "ఇంకేదిగాదు ? నవ్వుల తళతళల్తో ఆహ్వానిస్తూ ప్రియమార పిలుస్తావుగదాఅని ఎదురుచూస్తున్నాను. కాని ఒక్కటేదుఃఖం. పైగా వణుకరిస్తే సమాధానంలేదు. మోడులాఉన్న నా హృదయానికి వసచైతన్యం కలుగచేస్తావని ఆశించాను అసలు సంగతేమిటో చెప్పుసుశీ !" అన్నాడు డాక్టర్.

ఇంత మౌనంగా ఉంటే ప్రయోజనం ఏమాత్రంలేదని గ్రహించింది. అసలు సంగతేమిటో చెప్పేందుకు నిర్ణయించింది. ఆ విషయం ఇప్పుడు గాకపోతే ఇంకొంతసేపటికైన బయటపడ వలసిందేనని తలంచింది "భయంగా ఉందండి" ఏదో అనబోయి ఈమాట అనేసింది

"ఎందుకా భయమనేదే నా ప్రశ్న ?"

"మీకు మోసం చేశానేమోఅని" ఉన్నధైర్యాన్నంతా కూడగట్టుకొని చివరికం దీమాట

"మోసమా ! ఏమిలేదే ? పరస్పరం నచ్చి, మెచ్చి చేసుకొన్నాం పెళ్ళి. అంతేగదా ?"

"బహుశా మీరీపాటికి విషయాన్నంతా గ్రహించే ఉంటారనుకొంటాను."

"లేదే. ఏముంది గ్రహించడానికి ?"

"మీరు చూసినంతవరకు నాచేష్టలవల్లగాని, నా ప్రవర్తనవల్లగాని మీరేమి గ్రహించలేకపోయారా ?"

"లేదు. ఏమాత్రంలేదు."

"మీరు చాలమంచివారు. మీ మనస్సుగూడ చాల మంచిది. అందువల్లనే మీకన్నీ మంచిగానేతోస్తాయి. మీకసలు విషయం ఇంతకుముందే తెలిస్తే మీరుగూడ మనపెళ్ళికి అంగీకరించకపోదురు "

"అసలు నాకుతెలీకుండా కప్పిపుచ్చిన రహస్యమొకటుందన్నమాట. మీ తల్లిదండ్రులైనా చెప్పలేదే ?

"నేనొక ఇంటిదాన్నైతే చాలని తహతహపడుతున్న తల్లిదండ్రు లెలా చెప్పగలరు ?"

"ఏమిటాసంగతి ?"

"పాపం ! ఎన్నోసంబంధాలు తెచ్చారు నాన్న. ముందుకుముందే జాగ్రత్తపడి అసలురహస్యాన్ని ఎరిగినవాళ్ళంతా పెళ్ళికంగీకరించక వెళ్ళి పోయారు, మీకాసంగతి తెలీదు. ఈసారి గుట్టుబయటపడకుండా అమ్మా నాన్నలు చాల జాగ్రత్తగా మెలిగారు మీరంగీకరించారు పెళ్ళికి. నా మన స్సేమో బాధపడుతూనేవుంది. పోనీ ఆవిషయాన్ని తెలిపితే బాగుండునని పించింది. కాని ఆ సదవకాశం ఇప్పుడుగాని లభించలేదు. వచ్చిన సంబం ధాలు తిరిగిపోవడమేకాదు. అసలు బావ ప్రసాద్ పెళ్ళికంగీకరించలేదు. బలవత్తరకారణం లేకపోతే బావ అంగీకరించకపోతాడా?" సుశీల అంటూం డగా "ఆఁ! అలాగా ?" అన్నాడు డాక్టర్ ఆశ్చరంతో

"ఔనండి" చెప్పలేకపోయింది సుశీల ఆశ్చర్యంతో వింటున్నాడు డాక్టర్.

"నాకు పెళ్ళి చేయదల్చుకొన్నారు అమ్మానాన్న. పుణ్యమాఅన్నట్టు యూనివర్శిటీలో చదువుతూండి వేసవిసెలవుల్లో ఇంటికివచ్చాడు బావ అంతకుముందెప్పుడు ధరించనినేను కళ్ళజోడు ధరించిఉండగా వింతగా చూశాడు బావ. కళ్ళజోడెందుకు ధరించావని అడిగాడు మొదట చెప్పలేక పోయాను. చెప్పేంతవరకు వదలిపెట్టలేదు. ఈవిధంగా చెప్పాను.

"ఒకనాటిరాత్రి వర్షమేఘావృతమైంది ఆకాశమంతా. కన్నుపొడుచు కున్నా కానరాని కటికచీకటి. చినుకులు ప్రారంభమయ్యాయి కొంతసేప టికి కడవలతో గుమ్మరించినట్లు వర్షంపడుతూంది. ఏదోపనుండి దొడ్డివాకి గుండా తోటలోకి తొంగిచూశాను. ఫెటీంనేశబ్దంతో ఒక ఉరుమురించి

నాకుదగ్గరలోనే తోటలో ఒకచెట్టుమీద పిడుగుపడింది. ప్రపంచమంతా కోటిసూర్య ప్రభాసితమైపోయింది నాకళ్ళకంతా వెలుగే. వెలుగు భరించ లేక కళ్ళుమూసుకొని తెరిచాను. ఇంకేముంది ! అంతా గాఢాంధకారమే ! ఇదంతా ఒక్క నిమిషంలో జరిగిపోయింది. కెవ్వుమని కేకపెట్టాను. అమ్మా నాన్న పరుగునవచ్చారు పరిస్థితినంతా అర్థంచేసుకొని చాల దుఃఖించారు. నాన్న ఎంత డబ్బైన వెనుదీయలేదు ఎంతోమంది డాక్టర్లకి చూపించారు. నాటు వైద్యం చేయించారు కాని ప్రయోజనం మాత్రం శూన్యం. ఆ ఆశే వదలిపెట్టాం. అప్పటినుంచి లాభం లేకపోయినా ఈ కళ్ళజోడు మాత్రం ధరించాను. అసలు కథంతా విన్నతర్వాత ససేమిరా ఈ పెళ్ళికొప్పుకో నన్నాడు బావ కాని తెలీక మీరంగీకరించారు మావల్ల కలిగిన అప రాధాన్ని క్షమించండి" —అంటూ నిజంగానే ఏడ్చింది సుశీల.

ఈ సంగతంతా వింటూంటే "ఇదిగోమ్మా వీణ నీ కుడిచేతిపక్కనే ఉంది" అన్న శాంతమ్మ మాట జ్ఞాపకమొచ్చింది డాక్టర్‌కి తర్వాత మొదటిసారిగా వీణ తీసుకోబోయినప్పుడు సుశీల చేతులు తడబడటానికి, గులాబీ పుష్పం అందాన్ని గురించి అడిగినప్పుడు, నెక్లెస్ చూపించి నప్పుడు, సమాధానమివ్వక పోవటానికి, మంచం దగ్గరికి రమ్మంటే తానే స్వయంగా రాకపోవటానికి — కారణం ఇప్పుడు స్పష్టంగా తెలుస్తుంది డాక్టర్‌కి. మౌనంగా ఉన్నాడు.

"అసలు సంగతి తెలిసినాక బాధపడుతున్నారు కదూ ! నాకు తెలుసు నావల్ల మరొకరు బాధపడటం నేను సహించను. అందుకే నాకింత బాధ !" —అంది సుశీల దుఃఖంతో.

"లేదు సుశీ ! నేనే మాత్రం బాధపడటం లేదు. నేను 'ఐ స్పెష లిస్టు'ని. ఇలాంటి ఎన్నో కేసులకి ట్రీట్‌మెంట్ ఇచ్చాను చాల కేసులు

సక్సెస్ అయ్యాయి. నేను మిగతావాళ్ళ మాదిరి తిరస్కరిస్తే నా ప్రత్యేకతేమిటి ? రేపటినుంచి ట్రీట్‌మెంట్ ప్రారంభిస్తాను. అట్లని నా అంతరాత్మ చెబుతోంది. ఇదిగో నా కుడికన్ను కూడ అదురుతూంది. ఇది శుభసూచకం. నీవు నాదానివి సుశీ! కావాలంటే నా హృదయాన్నడుగు...." అంటూ సుశీలని దగ్గరికి తీసుకొన్నాడు డాక్టర్. డాక్టర్ అమృత వాక్కులకి, దయాస్వభావానికి ఆనందించింది సుశీల. అతని కరస్పర్శతో తన్మయత్వం చెందింది.

పక్క మీది మల్లెలు ఫక్కున నవ్వాయి.



# అదృష్టయోగం

బజారంతా కోలాహలంగా ఉంది. అప్పుడే బళ్ళనుంచి విద్యార్థి లోకం తిరోగమిస్తుంది. మాస్టార్ల పాఠాలతో బాగా విసిగిపోయినట్టున్నారు పాపం! వాళ్ళ మెత్తని, చిన్ని మెదళ్ళు పాఠాలను ఎక్కడ భరించగలవు? ఏదో ఉబుసుపోకకు సరదాలకైతే మేమంటూ మేమంటూ ముందంజవేస్తారు? వాళ్ళకు సరదా అంటే తగని సరదా! కేరింతలు కొడుతున్నారంతా!

“ఒరే రామూ! చంద్రమ్మ దగ్గర తీసుకొన్న అప్పు తిరిగి ఇచ్చేయ్యవోయ్!” అన్నాడు రవి. రామూ, రవి సహవిద్యార్థులు. రౌడీతనంలో మంచి పేరున్నవాళ్ళు.

“ఔను రవి! ఇవ్వాలి: ఇదిగో చంద్రమ్మవ్వా! నీ డబ్బు!” – అంటూ రాము దోసిటనిండ గులకరాళ్ళు తీసుకొని, రోడ్డుప్రక్కన చిన్న రాళ్ళకుప్ప వేసుకొని, తల విరబోసుకొని, పూర్తిగా నగ్నం కాకపోయినా, పూర్తిగా కప్పని బొంతతో, సంస్కారరహిత అయిన ఒక వృద్ధ స్త్రీవైపు విసిరాడు.

“ఓరి కుర్రకుంకా! డబ్బు తీసుకెళ్ళిన వెధవా! మర్యాదగా ఇవ్వాలిగాని పారేస్తావా?” – అంటూ వకవకా నవ్విందామె.

“ఇదిగో! మర్యాదగానే ఇస్తా తీసుకో!” అంటూ చిన్న రాతితో కొట్టాడు రవి.

ముసలిదాని తలకు ఆ రాయి బలంగా తగిలిందేమో రక్తం బొట బొట కారింది. “అమ్మో!” అంటూ కేకపెట్టి; “ఉండు వెధవ! నీ ప్రాణాలు తీసేస్తా” – అని ఏడుస్తూ పరుగెత్తుకొని వచ్చింది.

రవి, రామూ దూరంగా పరిగెత్తారు చంద్రమ్మకి దొరక్కుండా. ఇంతలో కొంతమంది రాళ్ళకుప్పకు జొరబడ్డారు.

"అవ్వా! అవ్వా! నీ డబ్బంతా పిల్లలు ఎత్తుకపోతున్నారు" అన్నాడో ధర్మాత్ముడు.

"ఆగండి దొంగ వెధవల్లారా" – అంటూ రాళ్ళకుప్ప వద్దకు మళ్ళీ పరుగెత్తుకొని వచ్చింది. అప్పటికే పిల్లలంతా దూరంగా వెళ్ళిపోయారు. కొంతమంది వినోదం చూస్తున్నారు దూరంగా నుంచోని. బడిపిల్లలు అలసిపోయినట్టున్నారు. అందరు ఇళ్ళకు వెళ్ళిపోయారు.

చంద్రమ్మ మాత్రం తనలోనే గొణుక్కొంటూ నవ్వుతూ ఏడుస్తూ రాళ్ళకుప్ప సరిచేసుకొంటూంది. ఇంతలో రవి, రాము తిరిగివచ్చారు. "చంద్రమ్మవ్వా! స్వామొచ్చాడు" – అన్నాడు రవి.

"ఆఁ! ఏ స్వామి?" – ఆసక్తితో అడిగింది చంద్రమ్మ.

"ఆ సామి! పరంధామయ్య స్వామి!" – అన్నాడు అబ్బాయి.

"ఆఁ నిజమేనా! ఎక్కడ! వాణ్ణి చంపేస్తా!" – అంటూ దిక్కూ మొక్కూ తెలీకుండా పరుగెత్తింది. కొంతదూరం వెళ్ళి కెవ్వున కేకపెట్టి పడిపోయింది.

"పిచ్చిమనిషి!" – అని నవ్వుతూ రాము, రవి వెళ్ళిపోయారు.

* * *

"స్వామీ! స్వామీ! మీరు భోజనం........" అంటూ గొణిగింది చంద్రమ్మ పరంధామయ్య స్వాములవద్దకు వెళ్ళి. స్వాములవారు అర్ధనిమీలిత నేత్రాలతో యోగముద్రలో ఉన్నారు.

లోపల్నుంచి వస్తూ పై మాటలు విన్న శాంభవి "అమ్మా చంద్రమ్మా! స్వాములవారు ఆహారం తీసుకోరు తల్లీ! సమయమెరిగి మనమే ఇస్తే పాలుగాని పళ్లుగాని పుచ్చుకొంటారు. ఈ విషయం వచ్చిన రోజే చెప్పాను గదమ్మా!"

"ఔనమ్మ శాంభవమ్మ నిజమే! నా మతిమండా మరిచేపోయాను. అయినా ఈ పాలు, పళ్లతో ఏమి తీరుతుంది? కాని యోగనిష్ఠలో ఉన్నారు గనుక ఇవేవీ సోకవు! సరే నాకు పనుందిగాని బయట! నే వెళ్తా! మరి నీవేమో స్వాములవారికి ఆ పాలు పళ్లమాత్రం ఇవ్వడం మరిచేవు తల్లీ! నే వెళతా!" అంటూ బయటికి వెళ్ళింది చంద్రమ్మ.

"సరే వెళ్ళిరామ్మా! అవన్నీ నేను చూసుకొంటానుగా!" అంది శాంభవి.

ఏదో పనిమీద బయటికి వెళ్లుతూందిగాని చంద్రమ్మ మనసు మాత్రం పరిపరి విధాలుగా ఆలోచిస్తూంది

చంద్రమ్మకు స్వాములవారంటే ఎంతో ఎంతో భక్తి, గౌరవమూ కుదిరాయి వచ్చి నాలుగైదు రోజులే అయినప్పటికి నెరిపినెరయని గిరిజాల జాతు; కావాలని సంస్కారం చేసినగడ్డం _ ఒక మహాత్మ్యాన్ని నిరూపిస్తున్నాయి. అన్నిటికంటె ముఖ్యమైనది ఆయనలో ఉన్న మితభాషిత్వం. ఆయన వచ్చినరోజు మాత్రమే తనతో మాట్లాడారు. ఆ మాట్లాడింది కూడ ఏదో కొద్దిసేపు మాత్రమే. ఏది చెప్పిన క్లుప్తంగా, సూటిగా, నమ్మికే కలిగేట్లు చెప్తారు తన జీవితంలో ఇంతవరకు మేము స్వాములమంటూ బయలుదేరిన వ్యక్తుల్నెంతమందినో చూపింది కాని వాళ్లందరిమీద తనకే విధంగా విశ్వాసం కలుగలేదు.

చెరువు గట్టుమీద స్వాములవారు వేంచేసి ఉండగా తన యింటికి రావలసినదని వేడుకొంది చంద్రమ్మ. శాంభవి ప్రోద్బలంతో స్వాముల వారు తన యింటికి వచ్చారు. తనకెంతో ఆనందం కలిగింది.

స్వాములవారు రెండే రెండు మాటలు చెప్పారు. తన భర్త పోయిన తరువాత తన యోగం మారిందని, ఇంక యిటు తరువాత మంచి అదృష్ట యోగం ఉందని చెప్పారు ఎంతో చక్కగా సెలవిచ్చారు స్వాములవారు. చంద్రమ్మ పేరు గడించినది భర్త పోయినవెనుకే, అంతకు పూర్వం మామూలు మనిషి. పరంధామయ్య స్వాములు తన యింటిలో అడుగుపెట్ట డమే మహాయోగం! ఇంక తనకి అదృష్టయోగం ఉందని స్వాములవారు చెప్పడంలో ఎంతైనా సత్యముంది.

అన్నం లేకుండా బ్రతకడం మహాకష్టం. స్వాములవారు పాలు పళ్ళతో మాత్రమే జీవితయాత్ర కొనసాగిస్తున్నారు. ఈ కలికాలంలో గూడ ఎంతో యోగసిది ఉంటే తప్ప సామాన్యంగా అందరికి సాధ్యమవు తుందా? నిజంగా యోగసిద్ధి ఉన్నవారు పరంధామయ్య స్వాములవారు.

శాంభవి స్వాములవారికి తగిన భక్తురాలు. ఆయనకు సేవచేయ డంలో ఎంతో ఆసక్తి చూపిస్తుంది శాంభవి. సమయాసమయాలు గుర్తెరిగి నడుచుకొంటుంది.

ఏ వేళకేది అవసరమో తెలుసుకొని స్వాములవారికి అన్నీ సమ కూరుస్తుంటుంది పెద్ద వయస్సు లేకపోయినా శాంభవి ఎంతో సంయమ నంతో, నిష్ఠతో ప్రవర్తిస్తుంది అదే శాంభవిలో ఉన్న గొప్పదనం.

చంద్రమ్మ భర్తపోయిన తరువాత పేరు సంపాదించుకొన్న పూర్వ సువాసిని. అంతకుముందు గూడ చంద్రమ్మదే యింటి వ్యవహారమంతా.

చిన్నప్పుడు తనవాళ్ళని ఎదిరించి తన కులంగాని వ్యక్తిని వివాహం చేసుకొంది. మొదట్లో ఆమె అంటే గిట్టనివాళ్లే అధికం. కానీ డబ్బు దస్కం కొంత చేసుకొన్నాక అంతా తనవాళ్లే అన్నట్లు తామరతంపరగా చుట్టాలు, పరిచయస్థులు రాసాగారు. దానితో చంద్రమ్మ పేరు నలుగడల మారుమోగిపోయింది. ఆ చుట్టుపక్కల ఆమె పేరు విననివారే లేరంటే అతిశయోక్తి కాదేమో!

ఆమెని గురించి పలువురు పలువిధాలుగా అనుకొంటారు. ఆ మాటలన్నీ ఎదుటమాత్రం కాదు! ఆమెని చూశాక ఎవరుగూడ చాల మంచిది అని తలంచకుండా మాత్రం ఉండలేరు. ఆమెకు దేశంనియందుగల భక్తి, పెద్దలయెడ గౌరవం, స్వాములవారి యందుగల వినయవిధేయతలు, బీదసాదల యెడలగల దయ, సాటివారియందు గల సమానత్వం – మొదలైనగుణాలు ఎవళ్ళనైన ఆకర్షించకపోవు కాని ఇన్ని ఉత్తమ గుణాలుండడానిక్కారణం ఉందంటారు తెలిసినవాళ్లు ఆమె పొందిన సాంఘిక నైతిక పతనాలను కప్పిపుచ్చుకోడానికే అని తలంచేవాళ్లు గూడ లేకపోలేదు. నైతికంగా పతనమైనవాళ్లు మంచివారనిపించుకోడానికి కావలసిన పనులన్నీ చేస్తుంటారు. ఇది లోకసహజం!

భర్తపోయాక చంద్రమ్మ చిన్న హోటల్ ఒకటి పెట్టింది. వ్యాపారం బాగానే జరుగుతూంది. కాని తాననుకొన్నంత లాభంమాత్రం గడించలేకపోయింది. హోటల్ నడపడంలో తనకు చాకచక్యం లేకకాదు. కాలేజి కుర్రాళ్లు, చిన్నచిన్న ఉద్యోగాలుచేస్తూ కుటుంబం లేనివాళ్లు, కోర్టు కచేరీలకు వచ్చేవాళ్లు – మొదలైనవాళ్లు తన హోటల్ ఖాతాదార్లు వాళ్ళందరిని ఇట్టే ఆకట్టుకోగలిగింది. కాని చంద్రమ్మకు ఆ హోటల్ వ్యాపారం అంతగా నచ్చలేదు. తనకు నచ్చక వదలిపెట్టిందిగాని లేకపోతే రోజు

రోజుకు వస్తువుల ధరలు పాపంలా పెరిగిపోతున్న ఈ కాలంలో గనుక చంద్రమ్మ ఆ హోటల్ అలాగే నడుపుతూ ఉన్నట్లయితే తప్పకుండ కోటికి పడగలెత్తి ఉండేది. హోటల్ వ్యాపారం నచ్చకపోవడమనేది ఏ ముహూర్తంలో జరిగిందోకాని, ఆ మరునటి రోజుకే ఆ స్థానంలో ఓ పెద్ద మనిషి కిరాణాషాపు పెట్టాడు. ఖాతాదారులంతా విస్తుపోయి దారిగానక బేజారెత్తిపోయారు. వాళ్ళందరికి సమాధానం చెప్పలేక విసుగెత్తిపోయాడు కిరణా షాపు పెద్దమనిషి.

ఓ మహానుభావుడి సలహామీద వడ్డీవ్యాపారం ప్రారంభించింది చంద్రమ్మ. వ్యాపారం జోరుగా సాగుతూంది. చంద్రమ్మ హుషారుగా ఉంది. అయితే ఏండ్లు గడిచేకొలది పాపభీతి, నీతి, న్యాయం వీటని గురించి ఆలోచించడం ఎక్కువైంది డబ్బుమీద వ్యామోహం మాత్రం పోలేదు. ఒకరిద్దరు ఇవ్వవలసిన డబ్బు ఇవ్వలేదు అవిగూడ చాల పెద్ద మొత్తాలే. కొందరు వడ్డీ యివ్వలేదు. ఎంతో నమ్మకగల వాళ్ళని యిచ్చింది. ఇస్తే మళ్ళీ వెనుదిరగలేదు దాంతో చంద్రమ్మ మనసు కొంచెం వికలమైంది. వడ్డీమాట దేవుడెరుగు ; అసలుకే సిసలుగా మోస మొస్తుందేమో అని హృదంతరాళంలో భీతిలేశ్యయొకింత పొటమరించింది. ఉన్నట్టుండి ఒక ముహూర్తంలో వడ్డీ వ్యాపారం విరమించింది చంద్రమ్మ. ఇచ్చిన అప్పులన్నీ క్రమేణ మెల్లమెల్లగా రాబట్టుకోసాగింది. అంతో యింతో సంపాదించుకొన్న డబ్బు దగ్గరే ఉంచుకొంది. అప్పుగా డబ్బిమ్మని ఎవరడిగినా తన దగ్గర డబ్బు ఏ మాత్రమూ లేదని, తాను ఇవ్వవలసిన వారికిచ్చివేశానని తప్పుకొంటూ రాసాగింది డబ్బు ఉన్నమాట ఎంత వాస్తవమో చంద్రమ్మకు డబ్బుమీద వ్యామోహం ఉన్నమాట కూడ అంతే వాస్తవం ;

* * *

అరమోడ్పు గన్నులతో ఇల్లంతా కలయజూశారు స్వాములవారు. అదను గనిపెట్టి శాంభవి స్వాములవారివద్ద చేరింది. స్వాములవారు కళ్ల విప్పి ఏమన్నట్లు చూశారు. "స్వామీ! ఈరోజు శనివారం. చంద్రమ్మ గుడికి వెళ్ళింది! ఇంక కొద్దిసేపటిలో రావచ్చు. వచ్చిన కార్యం మీరు విస్మరించినట్టున్నారు. కాలాతీతమైతే ప్రయోజనం లేదు" – అంది శాంభవి.

"లేదు శాంభవీ! మరచిపోలేదు నమ్మిక కుదరాలి గదా! ఈరోజు గుడినుంచి రాగానే చంద్రమ్మను నా దగ్గరకు తీసుకొనిరా. ఏవీ ఆ నోట్ల కట్టలు ? ఈ సంచిలో ఉంచు. రెండోది మరో సంచిలోవేసి, లోపల పెట్టు. వెళ్ల నీ పనిలోనే వుండు" – అంటూ యోగనిష్ఠలో మునిగి పోయారు స్వాములవారు. 'సరే' అంటూ వెళ్ళింది శాంభవి.

ఇంతలో చంద్రమ్మ రానేవచ్చింది. ఎందుకీ ఉదయం నుంచి శుభో దర్కాలైన చిహ్నాలే కనిపిస్తున్నాయి. చెప్పరాని సంతోషమేదో చంద్ర మ్మను ఉక్కిరిబిక్కిరిగా ఊపేస్తుంది. చంద్రమ్మ రాగానే స్వాములవారు పిలిచి నట్లు శాంభవి చెప్పింది. చంద్రమ్మకు ఆశ్చర్యమేసింది. ఇందుకు కారణం లేకపోలేదు. ఎప్పుడు మాట్లాడని స్వాములవారు ఈరోజు పిలిచారనగానే సంతోషమైంది. స్వాములవారి వద్దకు వెళ్ళింది చంద్రమ్మ. వారు ఎప్పటి లాగే యోగముద్రలో ఉన్నారు!

"స్వామీ!" పిలిచింది చంద్రమ్మ.

స్వాములవారి కనుదమ్ములు వికసించాయి. చంద్రమ్మ ఆనంద సాగరం తరంగాలతో తురంగలించింది.

"ఇష్టఫల సిద్ధిరస్తు" – దీవించారు స్వాములవారు. ముద్దుముద్దుగా ముసిముసిపోయింది చంద్రమ్మ.

"అమ్మా చంద్రమ్మా! నీ ఆతిథ్యానికి మేమెంతో ఆనందించాం. ఎన్నో ఊళ్లు తిరిగాము. కాని ఈలాంటి ఆతిథ్యం మాత్రం మేమెక్కడా పొందలేదు. మా సంతోషంకొద్ది నీకో ఉపకారం చేయాలనుకొన్నాము" — అన్నారు స్వాములవారు.

"ఆఁ దానికేముంది స్వామీ! నా భక్తికొద్ది నేను ఆతిథ్యమిచ్చాను. అంతే" అంది ఆ మాటలకు సంతోషించిన చంద్రమ్మ.

"నిజమే! కానీ నీకు డబ్బుమీద వ్యామోహం తగ్గలేదు. నీ దగ్గర కొంత ఉన్నది. నీ ఆశకు తగినంతకాదది. నీవేమీ అనుకోకపోతే నీకో ఉపాయం చెప్పాలనుకొన్నాను."

"ఆఁ చెప్పండి స్వామీ! సందేహం దేనికి?"

"నేను ఎంత డబ్బైనా తయారు చేయగలను"

"ఆఁ నిజంగానా?"

"ఇదిగో చూడు" అంటూ ఏదో మంత్రం పఠనచేసి "ఓం! హ్రీం ఆహాహా! శాంభవీ! హాంఫట్" — అని రెండు క్షణాలు కళ్లుమూసి తెరిచి "చూడు ఆ సంచిలో!" అన్నాడు స్వాములవారు గంభీరంగా!

...ద్రమ్మ సంచిలో నుంచి తీసిచూసింది. నూరు రూపాయలనోట్... ...ందు మెరిసింది. చంద్రమ్మ మనసు మురిసింది. ఆశ్చర్యానికి ..., ఆశకు అవధులు లేకపోయాయి.

...ంఫట్! లోపలున్న సంచిలో చూడు చంద్రమ్మ వెళ్ళి!" ...స్వాములవారు.

పరుగున వెళ్ళి లోపలున్న సంచిలో వెతికింది. మరో నోట్లకట్ట. దానితో గాఢమైన విశ్వాసం చంద్రమ్మకు కుదిరింది స్వాములవారిపై. ఆ సంతోషంతో ఏమీ మాట్లాడలేకపోయింది. ఇదంతా చూస్తున్న శాంభవి లోలోపలే నవ్వుకొంది.

చంద్రమ్మ స్వాములవారి వద్దకు పరుగున వచ్చింది నోట్ల కట్టలో.

స్వాములవారు నోట్ల కట్టలు తీసుకొని సంచిలోవేస్తూ "ఇలాంటి వెన్నైనా చేయగలరు" అన్నారు.

"అయితే చేయండి స్వామీ!" ఆత్మాసక్తిని చూపెట్టింది చంద్రమ్మ.

"కాని వీటివల్ల లోకవ్యవహారం కొనసాగదు తల్లీ! అది మహాశక్తి శాంభవి ఆజ్ఞ. దీనికంటె లౌకికమైనది మరొకట్టుంది"

"అయితే ఏమిటో చెప్పండి స్వామీ!"

"ఏమీలేదు మహాశక్తి శాంభవీ ప్రసాదం. లబ్ధమైన ఆ మహాత్మ్యం చాల గొప్పది దానికితోడు లౌకిక మానవశక్తి కూడ అవసరం. దానికై ఇన్నాళ్ళనుంచి ఊరూర తిరుగుతున్నా! ఇది అతి రహస్యం. ఎట్టి సమయంలోను నీవు బయటికి పొక్కనీగూడదు. నాలాంటి మరో స్వాముల వారు బెంగుళూరులో ఉన్నారు. వారితో మనం పొత్తు కలపాలి. దానికి కొంత మనంగూడ మొదట మన వాటా పెట్టుబడి పెట్టాలి ఆ తరువాత నోట్లు కట్టలు కట్టలు తయారవుతాయి" —

"అయితే తప్పకుండా బెంగుళూరు వెళదాము స్వామీ!"

"కానీ డబ్బో! నేను తయారుచేసే డబ్బు లోకవ్యవహారానికి పనికి రాదన్నాను గదా" —

"మీకు చింత దేనికి స్వామి! నాకేమి పిల్లాజెల్లా! నా దగ్గరున్న డబ్బంతా మీ చేతికిస్తా! పదండి రేపే పోదాం! ఆలస్యం దేనికి!"

"పోదాం! తప్పక పోదాం! నీకు ఇష్టమే నన్నమాట?"

"అవును స్వామీ! ఆత్మసాక్షిగా చెబుతున్నా! స్వామీ నాకు తెలీ కడుగుతాగావి! అక్కడ నోట్లు తయారుచేసే మిషన్ ఉందా!"

స్వాములవారు దరహాసంచేసి "బాను బాగా కనిపెట్టావు."—అన్నారు,

"బెంగుళూరులో ఏరో స్వాములవారు ఎక్కడున్నారో చెప్తారా స్వామీ."

"మీమాట జవదాట"నన్నది చంద్రమ్మ.

"రేపు రాత్రిబండికే ప్రయాణం. శాంభవి ఇంటివద్దనే ఉంటుంది. మనం మాత్రం వెళ్ళవస్తాం మనోరథ ప్రాప్తిరస్తు"—

"ఓ తప్పకుండా అంతకంటేనా" అంటూ లోనికివెళ్ళింది చంద్రమ్మ.

* * *

బెంగుళూరు మార్కెట్టువద్ద వేచివుంది చంద్రమ్మ. వచ్చేపోయే వాళ్ళని పరికించిచూస్తుంది. కాని స్వాములవారి జాడేలేదు. డబ్బంతా మూట గట్టి స్వాములవారికిచ్చివేసింది. చేతిలో రూపాయికిమించని చిల్లరమాత్ర ముంది. స్వాములవారు కనపడకపోవడం ఎక్కువ భయాన్ని కలిగిస్తూంది. కాలినడకతో అతి రహస్యమనిచెప్పిన ప్రదేశానికివెళ్ళి తిరిగిచూసింది. అక్కడ స్వాములవారి గురించి వాకబ్‌చేసింది, అలాంటి వాళ్ళప్రాంతంలో లేరనిచెప్పారు. చంద్రమ్మ గుండె దడదడలాడింది ఏదో చెప్పరానిభయం, ఆవరించింది. కడుపులో ఆకలిమంట, చెప్పరానిబాధ. ఉన్నచోట నిలవకుండ

వెర్రెత్తినట్లు బజార్లన్నీ కలయదిరిగింది. రెండు రోజులపాటు తనవద్దనున్న చిల్లరకాస్తా హరించిపోయింది. కాని స్వాములవారు కనిపించలేదు. తనకు తెలిసినవాళ్ళు బెంగుళూరులో లేకపోలేదు. కాని ఈలాంటి సమయంలో వెళ్ళడం తనకంత మంచిదిగా తోచలేదు. చీకట్లు ముసురుతున్నాయి. క్రమక్రమంగా తన మనసులాగా వాతావరణం చీకటితో నిండిపోతూంది. కాని గాఢాంధకారంలో అక్కడక్కడ వెలుగుతూన్న విద్యుద్దీపాల్లో ఆశారేఖలు లేకపోలేదు. మెల్లగా రైల్వేస్టేషన్ చేరుకొంది. తెలిసిన పెద్దమనిషి కనిపించాడు అదృష్టం కొద్దీ ఏదోపనుండి వచ్చాననీ, డబ్బంతా ఎవరో దొంగలు కొట్టేశారని ఆ పెద్దమనిషితో అబద్ధమాడి ఊరికి వెళ్ళినవెంటనే తిరిగి పంపుతానని కొంతడబ్బు ఇవ్వవలసిందని అడిగింది. ఆ పెద్దమనిషి ఆమెస్థితికి జాలివడ్డాడు. డబ్బిచ్చి వెళ్ళిపోయాడు చంద్రమ్మ వెంటనే ఆత్మారాముణ్ణి సంతృప్తి పరచింది స్టేషన్ కేంటీన్‌లో.

తన స్వగ్రామానికి తిరిగివచ్చే రైల్లోకూర్చుంది చంద్రమ్మ. గార్డ్ విజిల్‌తో రైలుకూతేసి కదలబోతూంది. చంద్రమ్మకళ్లకు ఏదో తళుక్కున మెరపింది. ఒకజంట వెళ్లుతూంది. పురుషుడు గిరజాలజుత్తు. పంచెకట్టులో ఉన్నాడు చేతిలో చిన్నపెట్టెవుంది. అంతకంటే స్త్రీ తన్నాకర్షించింది. అందులోను ఆమె ధరించిన ధర్మవరం చీర. తాను అలాంటిదే కొన్ని ఏండ్ల క్రితంకొన్నది అంతకుముందురాత్రి బెంగుళూరుకు ప్రయాణమవుతూ ధరించాలని తలంచి మానేసింది. ఆచీర ఈకాలానికి ఫాషన్ కాకపోవచ్చు. కాని దాని ప్రత్యేకతేవేరు. ఇంతలో రైలు ఎంతోదూరం వచ్చేసింది.

చంద్రమ్మ మనసులోగూడ ఆలోచన రైళ్లు పరుగెడుతున్నాయి.

స్వాములవారు తన్ను మోసగించారని గుండెనిబ్బరం చేసుకొంది. చంద్రమ్మ తనకంటె ముందుగానే స్వాములవారు ఇంటికి తిరిగివెళ్ళి

ఉంటారని మనసును సమాధానపరుచుకొంది. రైలు అనంతపురం స్టేషన్‌లో ఆగింది. ఆగిందేతడవుగా రైలు దిగినవెంటనే ఎకాఎకిని ఊరికెళ్లింది. ఇంకా పూర్తిగా తెల్లవారలేదు. కాని వెళ్ళేసరికి తలుపు తాళంవేసిఉంది. గుండె దడదడలాడింది చంద్రమ్మకు. ఇంతలో చుట్టుప్రక్కలఉన్న అమ్మలక్కలు గుమిగూడారు అంతకంటే పనిలేదన్నట్లు. అందులో ఒకామె తాళాలిచ్చింది చంద్రమ్మచేతికి. తాను స్వాములవారితోపాటు బెంగుళూరుకు వెళ్ళినరోజే శాంభవిగూడ వెళ్లిందట. ఇల్లువదలిపెట్టి ముగ్గురు ఒకేసారి వెళ్ళారని అందరు అనుకొన్నారట. ఈవిషయం తెలియగానే ఇంటిలోకి పరిగెత్తిపోయింది చంద్రమ్మ పెట్టెఅంతా వెదికింది తన ధర్మవరం చీర కనిపించలేదు. కళ్ళుబైర్లు కమ్మాయి. బంగారపు నగలుగూడ లేవు. వెంటనే తక్కున బెంగుళూరు స్టేషన్‌లో కనిపించిన జంట పరంధామయ్య స్వాములవారు శాంభవి జ్ఞాపకమొచ్చారు.

"అయ్యో నాతబ్బు నాతబ్బు" అంటూ గుండెబాదుకొంటూ, జుత్తు లాక్కొంటూ అరిచింది గట్టిగా "నాతబ్బు నాతబ్బు" అంటూ ఇల్లంతా తిరుగుతూ కెవ్వుమని కేకపెట్టి పడిపోయింది చంద్రమ్మ. అక్కడున్న అమ్మలక్కలంతా 'పిచ్చెక్కిం'దంటూ విభ్రాంతిచెందారు. వాళ్లకు తెలీకుండా వేళ్ళు బుగ్గమీదకెక్కాయి!

# పిడుగుపాటు

"కాంతం! దూరంగా ఉండు బొల్లెద్దు గుమ్మేస్తుంది" — పశువుల కొట్టంలో ఎద్దులు కట్టిపేస్తూ, పచ్చగడ్డి తెచ్చిన కాంతంతో అన్నాడు రమణయ్య.

"బావ ఉండగా నాకేం భయం" — అంది కాంతం ధీమాగా.

"అదీ నిజమేలే, కాంతం...." — అంటూ ప్రేమగా కాంతం కొంగు పట్టుకొన్నాడు రమణయ్య.

"అమ్మో!" — అంది కాంతం కొంగు విడిపించుకొనే ప్రయత్నంతో.

"ఏం కొంగు పట్టుకొంటే కోపమా?"

"అదికాదు, మూడుముళ్ళు పడేదంక ముట్టకూడదు."

"ఓహో అదా? మూడుముళ్ళేగాదు. ముప్పైముళ్ళు వేస్తా సరేనా?"

"అంతపనీ చేస్తావు బావ నువ్వు! కాని దానికి మంచిరోజు అవసరం గదా?" — సిగ్గులొలుకబోస్తూ అంది కాంతం.

"మంచి రోజెప్పుడో చెప్పరాదూ ? ఆ పనంత పూర్తిచేస్తావే" అన్నాడు రమణయ్య.

"అది మనంగాదు నిర్ణయించేది. నాన్న, అత్తయ్య ఉన్నారుగా?"

"నువ్వెప్పుడూ ఇంతే! ఈసారి ఉగాది పండగ తరువాత లగ్నాల్లో మన పెండ్లి ........"

"ఆఁ నిజంగానా! ఎంత మంచిదానవు కాంతం నువ్వు!" అంటూ ఆనందంతో కాంతాన్ని కౌగిలించుకోబోయాడు రమణయ్య.

"ఆహాఁ! ఉండు ఉండు.... ...." – అంటూ తప్పించుకోబోయింది కాంతం.

కాంతం చెయ్యి పట్టుకొన్నాడు రమణయ్య.

"కాంతం! దొండపండులాంటి నీ పెదవులు, కోటేరేసినట్లున్న నీ ముక్కు, అద్దాలాంటి నీ చెక్కిళ్లు, చేపల్లాంటి నీ కండ్లు – మిణుకుమిణుకు మంటూన్న ఈ లాంతరు వెల్తుర్లో కళకళలాడుతున్నాయి."

"అబ్బబ్బా! చాలు నీ వర్ణన. పనుందింకా. నేను పోతా."

"పోదువుగాని! మనం పెండ్లి చేసుకొని ఉత్తమ దంపతులమని పించుకోవల్ల కాంతం! అది నా కోరిక"

"సరే మంచి కోరికే. చాల బాగుంది బావ" అంటూ నవ్వింది కాంతం.

రమణయ్య తన చేతుల్తో కాంతం వదుం చుట్టేశాడు.

కాంతం తనివితీర బావ రమణయ్యనే చూస్తూ నిల్చుండిపోయింది – అర్ధనిమీలిత నేత్రాలతో.

ఇద్దరు తన్మయావస్థలో ఉండిపోయారు కొన్ని క్షణాలపాటు.

"అమ్మా కాంతం!" – అంటూ పిలిచింది సుందరమ్మ లోపలినుంచి

ఇద్దరు తెప్పరిల్లారు.

"వస్తున్నానత్తయ్యా" – అంటూ లోనికి తుర్రుమంది కాంతం.

రమణయ్య హృదయం గూడ కాంతంతోపాటు పరుగెత్తింది.

కాంతం తెచ్చివేసిన గడ్డి పూర్తిచేసి మోర్లు పైకెత్తి నెమరువేస్తూ రమణయ్యవైపే చూస్తున్నాయి ఎద్దులు.

వెంటనే గడ్డివామిలోకి దారితీశాడు రమణయ్య.

జొన్న చొప్ప, వరిగడ్డి, అంతా తడిసిపోయింది వానకి. ఉలవపొట్టు గూడ నీళ్ళుదిగి ముద్దయింది. శనగపొట్టుమాత్రం కొద్దిగా తడిపొడిగా ఉంది గంపనిండుగా శనగపొట్టు తీసుకొచ్చి ఎద్దులముందు దులిపాడు. ఆసక్తితో మేస్తున్నాయి ఎద్దులు. ఆవు, దూడ, తక్కినగొడ్లు ఆశగా చూశాయి ఏదో గడ్డితీసుకొచ్చి వాటిముందు వేశాడు.

ఆవు, మొన్ననే ఈనిన ఎనుము, రెండు చెంబులనిండా పాలిచ్చాయి. సంతోషంతో ఇంటిలోకిపోయాడు రమణయ్య.

పదిరోజులనుంచి పట్టినవర్షం విడువకుండా కురుస్తూనేఉంది కుంభవర్షం. పది పన్నెండు సంవత్సరాలనుంచి ఇలాంటివర్షం పడలేదు—రాయలసీమలో. రాయలసీమలో ఎప్పుడు క్షామమేగాని వరదలుండవు. ఈ సంవత్సరం మాత్రం జలమయమయింది చాలచెరువులు తెగిపోయాయి. ఈ ప్రాంతంలో ముఖ్యంగా అనంతపురంజిల్లాలో చెప్పుకోదగిన పెద్దనది పెన్న వర్షపునీరు, తెగిన చెరువులనీళ్ళ ఏకమై మహాభయంకరంగా విజృంభించి పెన్నానది వరదలకు గురిఅయింది ఈ వర్షాలవల్ల ఎంతో జననష్టం కలిగింది. ముఖ్యంగా పెన్నానదిలో అక్కడక్కడ కొందరు కొట్టుకొనిపోయినట్లు వార్తలు వచ్చాయి. కృష్ణా, గోదావరులవలె పెన్నానది నిరంతరం ప్రవహించదు. వర్షాలు కురిసినప్పుడే ప్రవహిస్తుంది. పెన్న పారిందంటే కొన్ని ప్రాణాలు తీసిందనే లెక్క. అందుకే దానికి పీనుగుల పెన్న అని ప్రసిద్ధి.

చెరువులు తెగిపోవడంవల్లను, వంకలు, వాగులు పారడంవల్లను, అధికంగా పంటలుగూడ నష్టమయ్యాయి. వానవల్ల అంతగా దెబ్బతినని పైరు శనగపంట మొదలైన మెట్టపంటలు గడ్డీగాదం పట్టిపోయాయి. కలుపు తీయించడానికి కూలీలు దొరకడమే కష్టం. దొరికిన మామూలు కంటే ఎక్కువ కూలీ ఇవ్వాల్సి ఉంటుంది. కాని రోజురోజుకు ధాన్యం ధరలు పెరిగిపోతున్నాయి. ధరల్ని అదుపులో పెట్టడానికి ప్రభుత్వంగూడ ప్రయత్నిస్తూనే ఉంది. రాయలసీమ ప్రజలకిది నిజంగా ప్రళయమే!

అనంతపురం జిల్లాలో ఒక పెద్ద చెరువు నిర్మాణంలో ఉంది అది పూర్తి అయితే కొన్ని నూర్ల ఎకరాల భూమి సాగులోకి వస్తుంది అది రాయలసీమలో ఉన్న ధర్మవరం, బుక్కపట్నం మొదలైన భారీ చెరువులలో ఒకటవుతుంది. కొంచెం చివరిదశ పనిమాత్రం మిగిలిపోయింది. వర్షాలు పట్టుకొన్నందువల్ల పని నిలిచిపోయింది. అది కొండలు, గుట్టల మధ్య ఉంది ఈ కట్ట కట్టడంలో ఎంతో నైపుణ్యముంది; నిర్మాణంలో కాదుగాని, ఆ స్థలాన్ని ఎన్నికచేయడంలో. ఇరుపైపుల కొండలు; మధ్య లోయలో కట్ట నిర్మింపబడింది. ఈ చెరువుకు కావలసినంత నీటి వరువ ఉంది. కొండలలోని వంకలు, వాగుల నీరంతా ఇందులో వచ్చిపడుతుంది.

ఈ చెరువుక్రింద భూస్థితి ఉన్నవాళ్ళలో వెంకటయ్య ఒక మధ్య రకం రైతు. తన యింటిలో తాను, తన ఒక్కగానొక్క కూతురు కాంతం మాత్రమే. తన చెల్లెలు సుందరమ్మను భర్తపోయాక తన యింటిలోనే ఉండిపొమ్మని చెప్పారు! ఒక్కడే ఒక్క మేనల్లుడు రమణయ్య. రమణయ్యే పొలంపనీ అదీ చూసుకొంటూ ఉంటాడు. ఇంటిపని సుందరమ్మ చూసుకొంటూ ఉంటుంది వెంకటయ్యకు ఏ చీకు చింత ఉండదు.

చెరువు మొరవపారి పొలాల్లో ఇసుక దిబ్బలు నింపేసింది. వర్షం కొంచెం తెరపిచ్చింది. పొలాల్లోని యిసుక తీయించే ప్రయత్నంలో ఉన్నారు రైతులు కొందరు.

"ఏమోయ్ అల్లుడు! చేనిలో ఇసుక తీయించేకి సాధ్యమవుతుందా రేపు?" – అని తేంచుకుంటూ లోపలినుంచి వస్తూన్న అల్లుడు రమణయ్యను – అప్పుడే బయటినుంచి వానకు పైగుడ్డ తలమీద వేసుకొని వచ్చిన వెంకటయ్య ప్రశ్నించాడు.

"ఔను మామయ్యా! రేపు ఇసుక తీయించవచ్చు. వానగూడ కొంచెం తెరపిచ్చింది. మళ్ళీ ఈవాన తిప్పికొడితే చెప్పలేం" – అన్నాడు రమణయ్య.

"సరే! మీ అమ్మేది?" – అని "సుందరమ్మా!" అంటూ పిలిచాడు వెంకటయ్య.

"ఏమన్నయ్యా!" అంటూ వచ్చింది సుందరమ్మ.

"ఇసుకదిబ్బలు తీయించేదానికి కూలీల్ని మాట్లాడమ్మ. పొద్దున వరకు ఉంచే దొరకుతారో లేదో ఈ రాత్రికే చెప్పు. రేపా పని పూర్తి చేయించండి."

"సరే అన్నయ్యా" అంది సుందరమ్మ.

ఇంతలో కూతురు కాంతం, చెంబులో నీళ్ల తెచ్చిపెట్టి "బువ్వ తిందువు రా అయ్యా" – అంటూ పిలిచింది.

"సరే" అంటూ భోజనానికి లేచాడు వెంకటయ్య.

రమణయ్య పశువుల కొట్టంలోకి దారితీశాడు.

భోజనాల దగ్గర సుందరమ్మ సంభాషణ ప్రారంభించింది.

"అన్నయ్యా! ఈ యేడు ముందరే వాన కురిసిందని సంతోష మైంది. కాని ఈ వానలవల్ల అంతా నాశనమయ్యేట్లుంది.''

"ఔనమ్మా భరణికురిస్తే ధరణి పండుతుందంటారు. ఈ యేడు కరువుకాటకాలుండవని రాయలసీమ ప్రజానీకం మురిసిపోతుంది. కాని రాగి, అక్కడక్కడ వరిపంటలు చేతికొస్తుండగా ఇంతలో అనుకోకుండా ఈ ప్రళయం ముంచుకొచ్చింది. ఈ వానవల్ల చాలనష్టమయింది. ఇది ఇప్పుడిప్పుడే వదలిపెట్టేటట్టులేదు. అంతా ఆ యేడుకొండలవానిఘటన...." నిట్టూర్చాడు వెంకటయ్య భోజనానంతరం చేయికడుక్కొంటూ.

కాంతం వక్కలాకులు తెచ్చిపెట్టింది అయ్యముందు.

"అంతేకాదమ్మా!"—మళ్ళీ ప్రారంభించాడు వెంకటయ్య తాంబూల చర్వణంతోపాటు. "హిందూపురంవద్ద చెరువుకట్టతెగి కొట్టాలు, మామూలు మిద్దెలు కొన్ని కొట్టుకొనిపోయినాయి."

"మరి మనుషులో" ప్రశ్నార్థకంగా అడిగింది సుందరమ్మ.

"చెరువు కట్టతెగింది పగలేకనుక జనమంతా మొదటే జాగ్రత్తపడి చీటీపాటీ, నగనట్రా— దొరికినవన్ని తీసిపెట్టుకొన్నారట. ఇంతలో కట్ట తెగిందట! ఇంక పామిడిదగ్గర పెన్న మహాజోరుగా పారిందట! కాని మొదట మోకాలిలోతు నీళ్ళతో ప్రవహిస్తూ ఉందట. ఒక పెండ్లి బండి నది దాటుతుండగా—నది ఉన్నట్టుండి ఉద్రేతుగాపారి బండి నదీప్రవాహంలో కొట్టుకొని పోయిందట!"

కాంతం, సుందరమ్మల వేళ్ల అనుకోకుండా ముక్కులమీదికెళ్లాయి.

"అందులో కొత్త పెండ్లికొడుకు, పెండ్లికూతురుగూడ ఉన్నారంట!"

"ఆఁ! ఎంత ఘోరం జరిగింది?"—అంది కాంతం ఒక్కసారిగా.

"ఇంతెందుకు మన చెరువుగూడ ఎప్పుడు తెగిపోతుందో అనే భయంగూడ లేకపోలేదు. కొండలు, గుట్టలలోని పై నీళ్ళు వచ్చిపడితే మాత్రం మనకు నష్టంకలుగకపోదు. అంతటికీ ఆ యేడుకొండలవాడే ఉన్నాడు. మనమెంత? మానవమాత్రులం! కాని రేపు ఇసుకమేటలు తీయించేప్పుడు మాత్రం రమణయ్యతో చెప్పు కొంచెం జాగ్రత్తగా ఉండుమని. ఇప్పుడేమో పెద్దవర్షం వస్తుందని అనుకోము. కాని ఎప్పుడేమి జరుగుతుందో చెప్పలేముకదా?"

"సరే అన్నయ్యా! చెప్తాలే."

కాంతం మదిలో మెదిలింది భయం ఎందుకో.

"కాంతం! అన్నం తిందాం రామ్మా!" పిలిచింది సుందరమ్మ.

కాంతంకు అన్నం తినాలనిలేదు ఎందుకో. అన్నం తినడానికి కూర్చున్న తొందరగా లేచిపోయింది కాంతం.

"ఎందుకే కోడలా! ఏమీతినలేదే?"—ఆశ్చర్యపోతూ అడిగింది సుందరమ్మ.

"ఎందుకో నయించలేదత్తయ్యా" — అని చేయికడుక్కొంది కాంతం.

"పిచ్చిపిల్లా" అంది సుందరమ్మ నవ్వుతూ.

రాత్రంతా ఎట్లోగడిపింది కాంతం. తొలికోడి కూసినట్లుంది తెల్లవారుతూందిగదా అని సంతోషం మేఘాలమధ్యని వేగుజుక్కలా మెరిసింది. కాని హృదయాన్ని ఏదో చెప్పరానిభయం ఆవరించింది. సారిసారికి నాన్న మాటలే జ్ఞాపకమొస్తున్నాయి.

ఇల్లంతా పరికించి చూసింది. ఏ విధమైన అలికిడీలేదు నాన్న, అత్తయ్యలు గాఢనిద్రలోని గుర్రుతప్ప.

నిమిషంలో పశువులకొట్టంలోకి వెళ్ళిపోయింది.

బావ మాంచినిద్రలో ఉన్నాడు.

ఏవో తియ్యనికలలు కంటున్నాదేమో, ఆ ముఖంలో హాసరేఖప్రొద మరించింది. అముఖం అన్నెంపున్నెం విరుగని చిన్నిపాప ముఖంలాఉంది. అన్నివిధాలైన బాధలకు, భయాలకు_అతీతమైనస్థితి అది ! సుషుప్తి !!

కాని తన కడుపులోమాత్రం దేవినట్లుంది ఫలానాఅని చెప్పడానికి వీలులేని భయం తన్నావరించినది.

మెల్లగావెళ్ళి రమణయ్య నుదుటిమీద చేతితో తాకింది.

రమణయ్య కాంతం హస్తస్పర్శతో ఈలోకానికి వచ్చాడు. ఎన్నడూ రాని కాంతం ఇంకా తెల్లారకముందే రావడంచూసి చాల ఆశ్చర్యపోయాడు.

వెంటనే సిగ్గుతో కుంచించుకపోయింది కాంతం.

"ఏమిటి కాంతం ! ఇంకా తెల్లవారలేదుగా ? అప్పుడేవచ్చావే ? ఆశ్చర్యంగా ఉంది"_అన్నాడు.

మౌనంగా ఉండిపోయింది కాంతం.

"ఏమిటో చెప్పు !" మళ్ళీ అడిగాడు రమణయ్య.

దైన్యముఖంతో మెల్లగా రోదిస్తూ రమణయ్య కౌగిలిలో పిట్టలా ఒదిగిపోయింది కాంతం.

"ఎందుకీ దుఃఖం ? ఎందుకో చెప్పు" అడిగాడు రమణయ్య బుజ్జగిస్తూ.

"ఈరోజు నీవు పనికి పోవద్దు బావ" – అంది కాంతం తమాయించుకొని.

ఆ మాట రమణయ్యను ఆశ్చర్యంలో ముంచింది.

"ఎందుకు, పోకపోతే పనెట్లా అవుతుంది?"

"కూలీల్ని పంపించి నీవింట్లోనే ఉండిపో."

"నీ మాటలు చాల ఆశ్చర్యంగా ఉన్నాయి. ఏంది సంగతి !"

"నాకెందుకో భయంగా ఉంది. నా మనసు ఏదో అశుభాన్ని శంకిస్తుంది. రాత్రంతా పీడకలలు నన్ను పీడించినాయి. నిద్రే లేదు ! నాన్న మాటలే జ్ఞాపకమొస్తున్నాయి."

"అవేం మాటలు ?"

"నీవు ఇసుక తీయించేందుకు పోయినప్పుడు జాగ్రత్తగా ఉండవలసిందని అత్తయ్యతో నాన్న చెప్పుతూండగా విన్నాను."

"ఓహో అదా! నాతో అమ్మ చెప్పిందిలే! భయపడితే వచ్చే కష్టాలు తప్పిపోతాయా? ధైర్యంగా ఉండు. ఏడుకొండలవాడెట్లా రాసింటే అట్లా అవుతుంది."

"నీవెన్నైన చెప్పు బావ, నాకు భయంగా ఉంది" అంది కాంతం కళ్ళనిండ నీళ్లు పెట్టుకొని.

"ఛ! ఏడుస్తున్నావా?" అంటూ కళ్లు తుడిచాడు రమణయ్య.

మలికోడి కూసింది.

తెలతెల వారుతూంది

"అమ్మా కాంతం!" సుందరమ్మ కేక వినిపించింది.

"అదిగో అమ్మ పిలుస్తోంది. వెళ్ల నేను పాలు పితుకుతా. తొందరగా చేనికి పోవలసి ఉంటుంది" ఆత్రంచేశాడు రమణయ్య.

"తొందరగానే కనిపిస్తావు గదా బావ?" – ప్రేమపూరిత నేత్రాలతో ఆసక్తిగా అడిగింది కాంతం.

"అనుకొంటే నిమిషంలో రెక్కలు గట్టుకొని నీముందు వాలనా?"– అంటూ కాంతం బుగ్గమీద చిటికేశాడు

ఎంతో కష్టంతో బావ కౌగిలి వదిలిపెట్టింది. బలవంతంమీద అక్కడినుంచి కదలిపోయింది. కాంతం.

కాని–కాంతం మనసు మాత్రం రమణయ్య వెంబడే ఉంది. ఏ పనిమీదా తనకిష్టంలేదు మనసు దేనిమీద లగ్నం కావడంలేదు

వెంకటయ్య ఉదయమే ఏదో పనిమీద పట్నం వెళ్ళిపోయాడు.

సుందరమ్మ ఇంటిపనిలో మునిగిపోయింది.

"కాంతం! ఏమిటమ్మా! పొద్దుటినుంచి ఉషారుగానే లేవే!" అడిగింది సుందరమ్మ.

ఏదో సమాధానం చెప్పింది కాంతం.

రాత్రి నిద్రలేని దానికేమో మత్తుగా ఉంది మగతగా కనురెప్పలు వాలిపోతున్నాయి. కాంతం నిద్రపోయింది.

*     *     *

రాత్రి అంతగా విపరీతమైన వర్షమంటూ లేదు కాని ఎక్కడో దూరంగా మంచి వర్షమే కురిసింది ఎత్తు ప్రదేశాల్లో. ముఖ్యంగా చెరువు పై భాగంలో ఉన్న కొండగుట్టల్లో పడిన వర్షపు నీరంతా లోయలలో వచ్చి ఈ చెరువులో పడుతుంది ఇంతకుముందే నిండి చెరువు మొరవపోతుంది. పై నీళ్లు వచ్చి పడేసరికి మట్టిపోసిన చెరువుకట్ట రెండుచోట్ల తెగింది ఈ విషయం పనిలో ఉన్న రమణయ్యకుగాని, ఇతరులకుగాని తెలియదు

ఆ చెరువు మహాసముద్రంలా ఉంది కట్ట తెగిపోతూనే సముద్రం చెలియలి కట్ట దాటినట్లే అయింది. మహాప్రళయమే కలిగింది చెరువు క్రింద ఉన్న పొలాల్లో పనిచేస్తూన్న మనుషులు, గొడ్డు గోదాతోపాటు అనుకోకుండా ఉప్పెనలా వచ్చిన ప్రవాహానికి గురయ్యారు పనిలోఉన్న జనంతో దూరంగా ఉన్నవారు తప్పించుకొన్నారు. తక్కినవాళ్లు ఎంత దూరమని పరిగెత్తగలరు. హాహాకారాలు బయలుదేరాయి.

రమణయ్య ఒకరిద్దరితోపాటు పెద్ద బండని ఆసరాచేసుకొని ఎగ బ్రాకుతున్నాడు కొంచెం దూరం ప్రాకగలిగితే దానిపైకి పోగలిగితే శామ జీవించినట్లే ! కాని వెళ్లే లోపల ఏం జరుగుతుందో తెలీదు. సాహసంతో ఎగబ్రాకుతున్నాడు. కడుపు, కాళ్లు, చేతులుదోగిపోయి నెత్తురు కారుతూంది. అయినా ఆశావేశం మనసులో కలిగింది పైకి వెళ్లుతున్నాము గదా అని. ఒక్కసారిగా కాంతం మతికొచ్చింది. కాంతం మాటలు మళ్ళీ వినిపించాయి. కళ్లు చెమర్చాయి. కాని మహాసముద్రంలో ఈ కన్నీటి చుక్కల లెక్క మిటి !

ఇంతలో ప్రవాహం విపరీతమైంది. భయాందోళనలతో కంపించి పోతున్నాడు తానుగూడ. భయపడుతూ, భయపడుతూనే ప్రవాహాన్ని చూశాడు ఎంతోమంది కొట్టుకొనిపోతున్నారు నీళ్ళలో. బండలు, చిన్న చెట్లు చేమలను ఆసరాచేసుకొని బ్రతుకు జీవుడా అంటూ భయంతో వణికి పోతున్నవాళ్లు అక్కడక్కడ కనిపిస్తున్నారు.

ఇంతలో అంతా అయోమయంగా తోచింది తనకు. తీరాచూస్తే తానప్పుడే నడిసంద్రంలో చుక్కానిలేని నావలా కొట్టుకొనిపోతున్నాడు. మునుగుతూ, తేలుతూ వెళ్లుతూన్నప్పుడు నీళ్ల తాగాడేమో పొట్ట ఉబ్బి నట్లుంది ఎక్కడో రాతికి తల బలంగా తగిలింది. తనకు స్మృతి తప్పింది. అంతే !

* * *

ఆకాశమంతా మేఘాచ్ఛాదితమై ఉంది కాంతం మనసులాగా. మిన్ను బ్రద్దలయ్యేట్లు పెద్ద ఉరుమురిమింది. ఎక్కడో పెద్ద పిడుగు పడింది – దానితో వేయి సమ్మెట పోట్లొక్కసారిగా కాంతం హృదయంమీద కొట్టి నట్లయింది. వెంటనే నిద్రలేచి పోయింది.

"అయ్యో బావా!" – అంటూ గావుకేక పెట్టింది తనకు తెలీకుండానే.

"ఏమిటే కాంతం!" – అంటూ సుందరమ్మ పరుగెత్తుకొచ్చిం దక్కడికి.

అంతలోనే పిడుగులాంటి రమణయ్య వార్త విన్న వాళ్ళద్దరు మూర్ఛలో మునిగిపోయారు. నిజంగా ఇది పిడుగుపాటే !

ఏదో పనిమీద పట్నానికి వెళ్ళి సాయంత్రం తిరిగివస్తూన్న వెంక టయ్య దారిలోనే సంగతంతా విని కుప్పలా కూలిపోయాడు! ఈ అతివృష్టి నిజంగా రాయలసీమ ప్రజకు ప్రళయమే ! పిడుగుపాటే !

# ఆత్మశాంతి

సుజాత పెళ్ళివార్త వినగానే విస్తుపోనివారే లేరు. బంధువులు' స్నేహితులు, పరిచయస్థులు - అందరు ఆశ్చర్యనిమగ్నులయ్యారు.

వరకట్నాలు పోసినా వరుడు దొరకని కాలంలో కట్నంలేకుండానే సుజాత పెళ్ళి కుదిరినది। సుజాత తల్లిదండ్రుల ఆసిపాస్తులన్నీ తాకట్టు పెట్టిన వివాహానికి తగిన డబ్బురాదు. ఇంక కట్నమెక్కడ తేగలరు ః ఇది తలిదండ్రులకు తీరని సమస్య. ఏదో మామూలు వ్యక్తితో పెళ్ళయినదని పించాలని తండ్రి తపన. ఎన్ని ప్రయత్నాలుచేసినా ప్రయోజనం శూన్యం. అందులోను సుజాతలాంటి పిల్ల ఒక యింటి కోడలు కావాలంటే కట్నం చాల అవసరం. ఎక్కువ కట్నం లభించేవైపుకు మొగ్గుతారీనాటి పురుష పుంగవులు. దానికి కారణం లేకపోలేదు: వాళ్ళు ప్రేమించేది పిల్లనుకాదు: తలిదండ్రులిచ్చే కట్నాన్ని. వలసినంత కట్నమిచ్చే స్థితిలోలేని సుజాత తలిదండ్రులు కొద్ది కాలంనుంచి ఆ విషయాన్ని గూర్చి ఆలోచించడం లేదు. అయితే ఎవరికివారే కుమిలిపోతున్నారు లోలోపలే!

కాని అకస్మాత్తుగా, తమ పాలిట దేవుడిలా అవతరించాడు శ్రీధర్. శ్రీధర్ లాంటి ఉత్తమ వ్యక్తి అల్లుడవుతున్నాడంటే కాదనేవాళ్ళుండరు సుజాత చాల అదృష్టవంతురాలని తలిదండ్రులే అన్నారు; తాము నోచిన నోములన్నీ ఫలించాయని తలపోశారు. ఏ విధమైన కట్నాలు, కానుకలు తనకక్కరలేదన్నాడు శ్రీధర్. పైపెచ్చు పెళ్ళికయ్యే ఖర్చులు గూడ తానే భరిస్తానన్నాడు శ్రీధర్ నిజంగా భగవంతుడే!

శ్రీధర్ తల్లి అనసూయమ్మ సంతోషానికంతే లేదు. కూతురు సుభద్ర పోయినతరువాత కుమారుడిన్నాళ్ళకు మామూలు మనిషి కాడో

'చాలా రోజుల నుంచి నన్నో ప్రశ్న వేధిస్తోంది.'

'ప్రశ్న? వేధిస్తోందా?' ఆశ్చర్యపోయాడు శ్రీధర్. 'నాలో ఏమైనా లోపముందా?'

'లోపమా? కాదు మీరు మానవాతీతులు'

'అయితే మరి ప్రశ్నేమిటి?'

'మీరు నన్నో దేవతలా ఆరాధిస్తున్నారు. మీ ఋణ మే విధంగా తీర్చుకోగలనో తెలీదు' అంటూ సజల నేత్రాలతో శ్రీధర్ పాదాలమీద వ్రాలిపోయింది సుజాత.

'ఛ' అవేం మాటలు? లే. లే' అంటూ దగ్గరగా తీసుకొన్నాడు. 'భార్యాభర్తల మధ్య ఋణమేమిటి? తీర్చడమేమిటి సుజా!'

'జన్మజన్మాలకైనా మీపాదదాసిగా నన్నుగ్రహించాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నా'—అంటూ శ్రీధర్ కౌగిలిలో చిక్కుపోయింది సుజాత.

'సుజా! ఏదో ప్రశ్నఅన్నావే?'—అడిగాడు శ్రీధర్ సుజాతకురుల లోనికి చేతులుపోనిచ్చి ప్రేమపూర్వకంగా నిమురుతూ.

'ఏమండీ! ఎంతోమంది సుందరాంగులు, చదువు సంస్కారంగల యువతులుండగా, కట్నం కానుకలు లేకుండా నన్నే చేసుకోవటంలో మీ అంతర్యం తెలుసుకోవాలనుంది. ఇలాంటి ప్రశ్నవేయకూడదు కాని నన్నా ప్రశ్న వేధిస్తూంది. చెప్పగలరా?' అడిగింది సుజాత తగ్గుస్వరంతో.

'చందమామ చల్లదనంవల్ల హాయననుభవిస్తూంది, చందమామ నెందుకు ప్రేమిస్తున్నావన్నట్లుంది నీప్రశ్న' అన్నాడు శ్రీధర్ దర హాసంతో.

'కాని చందమామలో కళంకం ఉందన్నమాట మీకు తెలుసు.'

'ఔను చందమామలోఉన్న కళంకం చంద్రబింబంలాంటి నీ ముఖంలోని బుగ్గమీది బ్యూటీస్పాట్ లాగా ఎంతో అందాన్ని చేకూరుస్తున్న వన్న విషయంమాత్రం మనం కాదనలేంగదూ ?'

ఆ సత్యాన్ని గ్రహించిన సుజాత కాదనలేకపోయింది పైపెచ్చు ఔనన్నట్లు తలూపింది.

'మరి మాట్లాడవేం ?'

'మీకు సమాధానమిచ్చేంతశక్తి నాకులేదు. కాని నాప్రశ్నకుమాత్రం సమాధానం రాలేదని మీకు తెలుసు.

'సమాధానంఉంది సుజా ! వింటే హృదయం తరుక్కుపోయే కరుణ రసాత్మకకథ. అదొక మహత్తరకావ్యమే. చెప్పాలనే అనుకొన్నాను. కాని అనవసరమేమోఅని తలచి చెప్పలేదిన్నాళ్ళూ. అడిగావు గనుక చెప్తున్నా.'

'అంత మహత్తర కారణముందంటారా ?' ఆసక్తితో అడిగింది సుజాత.

'ఔను సుజా !'—అంటూఅంతంగా శ్రీధర్ కళ్ళలో నీళ్ళు దిరిగాయి.

ప్రేమపూరిత వచనాలతో అతిదీన దృక్కులను దరవుతూ చెప్పు మన్నట్లు ఆసక్తిచూపెట్టింది సుజాత

'కరుణరసాత్మక గాథ వింటానికి నీకంత ఓపికుందా సుజా ?' అడి గాడు శ్రీధర్.

'ఔ' నన్నట్టు సుజాత మౌనంగా తలూపింది.

కాపురం స్వర్గం అనుకొంది సుభద్ర. కాని ఆఫీసు నుంచి ఆలస్యంగా రావడం; రాత్రిళ్లు బయటికెళ్ళి ఆలస్యంగా రావటం, అసలు రాకపోవటం; జరుగుతూ వచ్చాయి. మొదటి రోజులలో ఏదో ఆఫీసు పననీ, మిత్రు నింటి కెళ్ళానని ఏవేవో సాకులు చెప్పి భ్రమింపజేశాడు రామం. నిజమను కుంది సుభద్ర. కాని దొంగతనం ఎన్నాళ్లు దాగుతుంది? ఎంత రహస్యంగా ఉంచాలని ప్రయత్నిస్తామో అంత సులభంగా బయటపడుతుంది. అది సృష్టిలోని తమాషా!

'ఆఫీసు, స్నేహితులు, క్లబ్బులేగాని, ఇంట్లో భార్య సంగతులు మరచేపోయాడు రామం. క్రమంగా ఇంటికి రావడం మానేశాడు. వచ్చినా కొద్ది క్షణాలు మాత్రమే ఉండేవాడు ఆ ఉన్న కొద్ది క్షణాలైనా ఆనందానికి బదులు అవమానాలు, చీవాట్లు మాత్రమే సుభద్రకు లభించేవి. మద్యం, మదవతి - ఈ రెండు వస్తువులకు అధీనుడు రామం. పరస్త్రీ సంబంధమున్న విషయం వాడువీరు చెప్పగా వినడమే కాకుండా ప్రత్యక్షంగా సుభద్ర తన కన్నులతో, తన యింటికిరాగా ఎన్నోసార్లు చూసింది.' అంటూండగా మధ్యలో 'ఈ విషయం తెలుసుండి సుభద్ర ఏ విధంగా సహించిందండీ!' అడిగింది సుజాత.

'ఔను సుజా! సుభద్ర ఓర్మిలో భూదేవి. చాల రోజులు ఓర్చుకొంది కాని తన యింట్లోనే భర్త ప్రియురాళ్ళ ఎదుట అవమానిస్తు వచ్చాడు. సుభద్ర సౌందర్యాన్ని దూషించడం, 'వికలాంగి' అని వెకిలి చేష్టలతో అవమానించడం ఎన్నోసార్లు జరిగింది.' శ్రీధర్ అంటూండగా ఆశ్చర్యపోయింది సుజాత.

'సుభద్ర వికలాంగా?' ఆశ్చర్యాన్ని ద్యోతకం చేసింది మాటలలో సుజాత. అంతేకాకుండా హృదయం కళుక్కుమంది సుజాతకు. అనిమేషయై వర్యాకుల చిత్తంతో ఆలోచనామగ్న అయింది.

'నిజంగా మీరు భగవత్స్వరూపులండీ. నన్ను మీ రారాధిస్తున్నారు. మీ మానవాతీత గుణాన్ని, మీ హృదయ వైశాల్యాన్ని ఏమని పొగడాలో నాకు తెలీదండీ' అంటూండగా సుజాత కళ్ళలో ఆనందాశ్రువు లొలికాయి.

'సుజా! ఇంకా సందేహమా' _ అంటూ శ్రీధర్ కౌగిలిలోకి తీసుకొన్నాడు సుజాతను.

'లేదండీ! సంతోషమే' _ అంటూ ఆనందపారవశ్యంతో శ్రీధర్ గోర్వెచ్చని బిగికౌగిలిలో పిట్టలా ఒదిగిపోయింది సుజాత.



# సమర్పణ

ప్రియమైన రాధా!

ఇన్నాళ్ళకు నీకు సమాధానం రాస్తున్నందుకు చింతిస్తున్నా. కాని మరో విధంగా సంతోషిస్తున్నా. ఇన్నాళ్ళకైనా తీరిక చేసుకొని రాయగలిగాను. నీకు పెళ్ళయి అత్తవారింటికి వెళ్ళిన కొత్తలో ఓ ఉత్తరం రాశావు. దానికి నా సమాధానమిది. ఈ ఉత్తరం నీకందగానే సంభ్రమాశ్చర్యాలు పెనవేసుకొంటాయి తప్పకుండా ఇక్కడ తీరికే ఉండదు ఎట్లో తీరిక చేసుకొని రాస్తున్నా. మనం బి.ఏ. చదువుకొనే రోజుల్లో నా గురించి అడిగేదానివి. పూర్తి వివరాలు నీకు చెప్పలేదు. అంత అవసరం లేకపోయింది గనుక. ఈనాడు నా హృదయాన్ని నీ యెదుట పెడుతున్నా! దాని వల్ల నాకు కొంత ఉపశమనం కలుగగలదని నా విశ్వాసం. సాంతం వింటావు గదూ? విని రాధా! నా బాధను పంచుకొంటావు గదూ! మరి వింటావా?

నేను సరిహద్దు ప్రాంతాలలో క్షతగాత్రులైన భారతవీరుల సేవలో నిమగ్నురాలినయ్యాను. అదిగో ఆశ్చర్యపోతున్నావు గదూ? ఔను సేవ వలన ఆత్మసంతృప్తి కలుగుతుంది. ఆత్మసంతృప్తి సంయమనానికి దారి తీస్తుంది. ఆత్మనిగ్రహం వల్ల ఒక క్రమబద్ధమైన, సుశిక్షితమైన జీవితం అలవడుతుంది. ఇది నేను సేవచేయడానికి పూనుకొన్న తరువాత ఆకళించుకొన్న పరమ సత్యం.

మానవతలేని మనిషి మనిషికాడు. మానవత్వపుపాలు అధికమైతే దైవత్వం, తక్కువైతే దానవత్వం సిద్ధిస్తాయి. చైనావాళ్ళ విషయంలో మానవత్వం నశించి దానవత్వం అధికమైందనే చెప్పాలి. ఉన్నట్టుండి

ఉత్తుంగశృంగాలతో విలసిల్లుతూన్న హిమాలయంలో దాడి జరిపారు క్రూరులు చైనీయులు. నలభై కోట్ల భారత ప్రజానీకం ఏకకంఠంతో గర్జించింది. నైనా దురాక్రమణ మహాదారుణమని ప్రపంచమంతా వాకొన్నది. భారతవీరులు వైరులను మార్కొని చీల్చిచెండాడారు. కాని మహిమాలయ మైన హిమాలయంలో ఎముకలు కొరికే చలి ఒకప్రక్క: ఆహారపానీయాల కొరత మరోప్రక్క, అంతకంటె ముఖ్యంగా తగినంత అవసరమైన ఆయుధసామాగ్రి లేమి ఇంకోప్రక్క, ఇంతకంటే మరీ ప్రధానంగా అనుకోకుండా ఎదురైన ఈ యుద్ధం అన్నివిధాల భారత సైనికులను చెప్పలేని లోటుపాటులకు లోనుజేశాయి. చైనీయులు మన భూభాగం నుంచి కొంతవరకు వెనక్కు వెళ్ళినప్పటికి కొందరు భారతీయులు మరణించినట్లు, అనేకులు క్షతగాత్రులైనట్లు వార్తలు వచ్చాయి. అదిగో అప్పుడే పిడుగులాంటి, నా ఎదమీద సమ్మెట పోటులాంటి వార్తగూడ మాకు అందింది. అదే బావ మరణవార్త। బావ దుండగులైన చైనా సైనికుల నెదుర్కొని వీరవిహారం సలిపి వీరమరణం పొందాడట।

నిజంగా గర్వింపదగిన విషయమది। కాని నాలాంటి అభాగ్యురాలికి ఆశనిపాతం। తీరని లోటు।। ంపాదింపలేని భాగ్యవినాశం।।।

ఎవరు నా సర్వస్వమనుకొన్నానో వాళ్ళే లేనప్పుడు నా జీవితం దేనికి? అత్తయ్యా మామయ్యల సంరక్షణలో ఉండవచ్చు. కాని నా జీవిత లక్ష్యం అదికాదే? బావ దేశంకోసం ప్రాణాలర్పించాడు తద్వారా నాకో సందేశమిచ్చాడు బావ. నేనుగూడ దేశరక్షణకు ఉపయోగపడినప్పుడు నా జీవితాన్ని సద్వినియోగం చేసుకొన్నట్టు. అందుకే అత్తయ్య మామయ్యల అనుమతితో క్షతగాత్రుల సేవకై నన్ను నేను సమర్పించుకొన్నాను.

చిన్ననాడే దిక్కు మొక్కు తెలీని నన్ను ఒక్కదాన్నిచేసి అమ్మా నాన్న దివ్యలోకాలకు వెళ్ళిపోయారు. తెలిసీతెలియని ఆ సమయంలో

బిక్కు బిక్కుమంటూ వెక్కి వెక్కి ఏడ్చాను. అత్తయ్యా మామయ్యలే అమ్మానాన్నలై ఆదరించి అనునయించారు. అత్తయ్య ముద్దుమురిపెం చూపి పెంచింది. అమ్మలేనిలోటు నన్నెప్పుడు ఏవిధంగాగూడ బాధించలేదు. అత్తయ్య మామయ్యలకు ఒక్కగానొక్క కుమారుడు రాజారావు. రాజారావుబావ నాకు ఎలాంటి అసంతృప్తి నాలో కలుగనీయలేదు.

చిన్నప్పటినుంచి బావ నేను ఏవిధమైన అరమరికలేక జీవితాలు గడిపాము ఎప్పుడైన ఆటల్లోపాటల్లో నేను చిన్నబుచ్చుకొంటే నవ్వించి కవ్వించేవాడు బావ. బావలేనిది ఒక్కనిమిషమైన గడిచేదికాదు అన్నెం పున్నెం ఎరుగని మాజీవితాలలా గడిచిపోయాయి బావ ఏదూరతీరాల్లో ఉన్నాడో అనేభావం ఎదలో మెదలితే బాధే ఎదురౌతుంది కాని మేఘాన్ని అనుసరించే మెరుపులా, వెలుగుననుసరించే నీడలా బావననుసరించి నేనుండేదాన్ని. అందువల్ల ఇప్పుడుగూడ బావవెంబడే నేనున్నట్లు భావిస్తున్నాను. ఆ విధంగా సంతృప్తిపడుతున్నాను. అదినాలో కలిగిన ఆత్మస్థైర్యం.

మంచి ముహూర్తంచూసి బావకు నాకు పెళ్లిచేయాలని నిర్ణయించుకున్నారు అత్తయ్యా మామయ్యలు. ఇంతలో చైనా దురాక్రమణ ఉప్పెనలాఎదురైంది. దేశరక్షణార్థం సరిహద్దుప్రాంతాలకు సైనికుడిగా వెళ్తానంటూ బయల్దేరాడు బావ. అత్తయ్య మామయ్యలు ఎంతగానో వేడుకొన్నారు బావను పోవద్దని. కాని ప్రయోజనంలేకపోయింది. "నాయనా ! రాజా ! మమ్మల్నందర్నీ దుఃఖసముద్రంలో ముంచిపోతావా ?" అడిగింది అత్తయ్య కన్నీటితో.

"దుఃఖించేసమయం కాదమ్మాయిది. సంతోషంతో ఆశీర్వదించి పంపాల్సిన సమయం"—అన్నాడు బావ.

బానిన నాలాంటి వాళ్ళకు దయ, సానుభూతి కలుగడంలో ఆశ్చర్యంలేదు. "ఇంక కొద్దిరోజుల్లో మీరు విడుదలవుతారు బాబూ" తలంతా దెబ్బలు తగిలిన రోగికి కట్లుకడుతూ చెప్పాను. అతని శరీరమంతా మారురూపు ధరించినట్లుంది. ఎవరు గుర్తుపట్టలేరు.

"సిస్టర్!" పిలిచాడతను

"ఏమిటి బాబూ!"

"ఏమీలేదు నాకళ్ళు మళ్ళీ వస్తాయంటారా?"

ఆ ప్రశ్న అడగ్గానే నాకు భయమేసింది. ఆ విషయంలో అనుమానం లేకపోలేదు. అయినా ఓదార్చాలి గనుక చెప్పాను. "ఎందుకు రావు. తప్పకుండా వస్తాయి బాబూ" _ అంటూ చకచకా వెళ్ళిపోయాను అక్కడనుంచి.

ఆ పేషెంటు దగ్గరికి వెళ్ళినప్పుడంతా ఏదో అభిమానం తలెత్తుతుంది నాలో. ఇంతమంది రోగులున్నారు. అందరిని నే నా విధంగా అభిమానించడం లేదే! దీనికి కారణం ఏమై ఉంటుందో! భగవంతుడికే తెలియాలి! అతనెవరు? నేనెవరు? ఏమిటీ సంబంధం?

మామూలుగా కట్లుకట్టడానికి వెళ్తే "మీకు పెళ్ళయిందా? ఏ ఊరు" అంటూ ప్రశ్నలవర్షం గురిపించాడు. నేనంతగా పట్టించుకోలేదు. కారణం సాధారణంగా అవి కొందరు రోగులడిగే ప్రశ్నలే గనుక. అంతతో పోనీక తన్నుగురించి చెప్పుకపోయాడు.

"సిస్టర్!" _ అతను నన్నుద్దేశించి అన్నాడు.

"ఏం బాబూ!" అడిగాను.

"నీలాంటి మరదలుపిల్లే నాకుండేది."

ఆ మాటతో నాకేవేవో ఆలోచనలు వచ్చాయి. కాని వెంటనే ఎంతో మంది మరదలు పిల్లలుండగూడదూ? అంటూ నాకు నేను సమాధానం చెప్పుకొన్నాను.

"సిస్టర్! ఏమిటి మాట్లాడరు? ఆలోచిస్తున్నారా?"

"అబ్బే లే" దంటూ అబద్దమాడాను.

"ఆఁ చెప్పండి మరదలుపిల్లను పెళ్లాడారా,"

"లేదు. చేసుకోవాలనుకొన్నాం. కాని........" అంటూ మధ్యలోనే ఆపేశాడు బాధాతప్త హృదయంతో.

"కానీ ఏమైంది చెప్పండి."

"ఏమీ కాలేదు. దూరమయ్యాము."

"ఏ విధంగా? పెద్దవాళ్ళకేమైనా గిల్లికజ్జాలు వచ్చాయా?"

"అబ్బే అదేమి కాదు."

"మరి కారణం? శాశ్వతంగా మీ మరదలు మిమ్మల్ని వదలి పెట్టిందా?"

"అబ్బే అదేంత మాత్రమూ కాదు. నా మరదలు అమృతమయి; చిరంజీవి; నాకోసం ఇంటివద్ద కాచివేచి వుంటుంది."

"అయితే బ్రతికే ఉన్నదన్నమాట" – అంటూ మౌనంగా ఆలోచిస్తున్నాను. మనసు పరిపరి విధాలుగా పోతూంది. అయినా ఇంతమంది

సైనికుల పరిస్థితులలో ఒకళ్ళని మరొకళ్ళతో సమానంగా ఉండకూడదని ఎక్కడైనా ఉందా అంటూ నన్ను నేను సంబాళించుకొన్నాను.

"సిస్టర్! ఏమిటి మళ్ళీ ఆలోచిస్తున్నట్టున్నారు?"

"ఏమీలేదు బాబూ. మీ అదృష్టాన్ని గురించి సంతోషిస్తున్నాను."

"కానీ సిస్టర్! నా అదృష్టమెట్లున్నా, నా మరదలు దురదృష్టానికి బాధపడుతున్నా "

"ఎందుకు?" ప్రశ్నించాను

"ఈ కళ్ళులేవి కటోదిని చూపిన వెంటనే కువ్వలా కూలిపోతుంది."

"లేదు తెప్పరిల్లి తన కళ్ళ మీకిస్తుంది "

"ఆ! నిజంగానా? మీకెవరు చెప్పారు సిస్టర్?"

"ఎవరూ చెప్పక్కర్లేదు బాబూ! అంతగా ప్రేమించిన మీ మరదలు తప్పకుండా ఆ విధంగా చేస్తుంది "

"ఎంత మంచివారు సిస్టర్ మీరు! సరిగ్గా నా మరదలు గుణాలే మీలో ఉన్నాయి."

ఆ మాటతో నాకు మాటలు పెకి! బయటికి రాలేదు.

"సిస్టర్ ! మళ్ళీ మౌనం! ఏమిటది?"

"అబ్బే ఏమీలేదు! నాలాంటి మరదలుందంటే నా మనస్సెంతగానో సంతోషించింది. నాలాగే తప్పకుండా మీకు సేవచేస్తుంది" - అన్నాను - ఓ ప్రక్క నన్నే బాధ అపరించి ఉన్నప్పటికి.

"కానీ సిస్టర్! ఈ నా దౌర్భాగ్య జీవితంతో నా మరదలు జీవితంలో చిచ్చుపెట్ట దలచుకోలేదు. విడుదలైనా ఎక్కడైనాక దూరానఉండి నామరద లకు మంచి సంబంధంచూసి పెళ్ళిచేసి సుఖపడుతూండగా వినాలని, సంతోష పడాలని ఉంది" - అంటూ తల అటువైపు తిప్పుకొన్నాడు.

"బాబూ! మీరెంత మంచివారు! మీ హృదయం ఎంత మంచిది!"- అని మెచ్చుకొంటూ అక్కడినుంచి వెళ్ళిపోయాను.

ఇట్లే ఎంతోమంది రోగుల బాధలను, మనఃక్లేశాలను వింటూ ఉండాలి రోజూ. ఇది మామూలైంది. నేనుచేసే సేవ ఎంత సాధారణమో ఇలాంటి మాటలు వినడంగూడ అంత సాధారణం. అందువల్ల ఈలాంటి సంభాషణలకంతగా ప్రాముఖ్యం ఇవ్వము. కాని వాళ్ళను సంతోషపెట్టేం దుకు మేముగూడ వాటికి సరిపోయే సమాధానాలిస్తూ ఉంటాము. అయినా ఆ రోగి కథనం మళ్ళీమళ్ళీ నా చెవుల్లో గింగురుమంటూ ఉంది.

ఇంతకంటే గూడ వన్నాశ్చర్యంలో ముంచివేసింది అతని పేరు. అతని పేరు రాజారావని తెలిసింది బావ పేరుగూడ రాజారావే!

కాని బావ రూపురేఖలు ఇతనిలో లేశమైనా కనిపించవు.

బావ యితరు కాదని చెప్పడానికి ఇంతకంటె బలవత్తర కారణం లేకపోలేదు. యుద్ధంలో బావ మరణించినట్లు వార్తలు అందాయి. చని పోయిన బావ మళ్ళీ ఎలా రాగలడు! కనుక ఇతడు నా బావకాదని నిర్ధారణ చేసుకొన్నాను. పోనీ రూపం పోల్చుకుందామా అంటే నల్లగా బొగ్గులా తయారయ్యాడు మనిషి: శరీరమంతా మానిపోయిన గాయాల తాలూకు మచ్చలు. వికృతమై ముడుచుకపోయిన ముఖం: కట్లలో కనిపించని కళ్లు: అందువల్ల ఇతడు బావకాదని తేల్చుకొన్నాను.

ఆరోజు కట్లు విప్పడానికి వచ్చారు డాక్టరు అతను ఎంతో ఉత్సాహంగా ఉన్నారు. కట్లు విప్పిన తరువాత తేలిపోయింది అంతా శూన్యమని. ఆయన ఎంతగానో విలపించారు. ఆ విధంగా పరిణమించినందుకు చాల బాధపడిపోయారు తన్ను తాను దూషించుకొన్నారు తన జీవితంమీద ఎంతో అసహ్యం వేసినట్లు తెలిపారు. సర్వాంగాల్లోను ప్రధానమైనవి కళ్లు. ఆ కళ్లే లేకపోతే జీవితం శోకభూయిష్టమే కాక మరేమవుతుంది?"

"సిస్టర్" ప్రశ్నించాడతను.

"బాబూ"

"నా జీవితం వృధా" అన్నాడు బాధాగత హృదయంతో.

"ఎందుకు? ఇంటికి వెళ్ళగానే అమ్మానాన్న లెంతగానో సంతోషిస్తారు తిరిగి వచ్చినందుకు."

"కావచ్చు కాని నా మరదలుసంగతో...." అంటూ ఇంక మాట్లాడలేకపోయారు. అతని ఆవేదనను నేను గ్రహించగలిగాను. కాని నేను మాత్రం ఏం చేయగలను?

"సిస్టర్! భగవంతుడు నన్నీవిధంగా తయారు చేయకపోతే నా ప్రాణాలు హరించి ఉండకూడదా."

"ఛ! అవేం మాటలుబాబూ! బతికి బయటపడ్డారు సంతోషించండి."

"ఏవిధంగా సంతోషించమంటారు సిస్టర్! మన సంతోషాన్ని చూచి ఆనందపడేవాళ్లు, సుఖపడేవాళ్ళు ఉన్నప్పుడేగాని లేకపోతే ఫలితమేమిటి?"

"అమ్మానాన్న, మరదలుకూడ మిమ్మల్ని ఆదరించి మీసుఖంకోసం పాటుపడతారుగదా బాబూ!"

"నిజమే! నాసౌఖ్యం అయితే చూస్తారుగాని వాళ్ళసౌఖ్యమో! నేను విడుదలైనవెంటనే వాళ్ళకళ్ళకు కనిపించకుండా ఎక్కడైనా దూరంగాఉండి వాళ్ళ సౌఖ్యాలకై ప్రయత్నిస్తాను. అదే నాకు సౌఖ్యం!" గాద్గదికమైన కంఠాన్ని సవరించుకొన్నాడు.

అతన్నే చూస్తూ నిలబడ్డాను నేను.

"సిస్టర్! చనిపోయావన్న నేను మళ్ళీ బ్రతికావట! చాలతమాషాగా ఉందిగదా ప్రకృతి?"

"అదేమిటి?" అన్నాను అర్థంగాక.

"యుద్ధంలో విపరీతమైన దెబ్బలుతగిలి పీనుగులా పడిపోయావట. చనిపోయానని అనుకొన్నారు కాని కొనఊపిరి ఎక్కడుందో మళ్ళీకదిలేసరికి హాస్పిటల్లోచేర్చారు. నిజంగానే బ్రతికాను కాని కాని బ్రతికిబయటపడ్డా కళ్లు లొట్టబోయాయి" అన్నాడు చాలబాధతో.

నాకు మళ్ళీ ఈమాటలు హృదయశల్యాలయ్యాయి. మౌనంగా ఉన్నాము. అతనే చెప్పకపోయాడు.

"కాని సిస్టర్! నాకో ఆత్మానందం లేకపోలేదు. మాతృదేశరక్షణకై వినియోగపడ్డాను అనే పరమానందం నాలోనిండి నిబిడీకృతమైంది."

నేనుగూడ ఔనన్నట్లు తలూపాను. వెంటనే ఆయనకా విషయం తెలియదని "నిజమే! మీరు మంచిమాట చెప్పారు. తల్లిదేశాన్ని రక్షించుకోవడం మనవిధి అందుకు మనంచేసే ప్రతికార్యం మన హృదయా

నందానికి దారితీయా"లని చెప్పాను. వెంటనే ఇంతలో డాక్టర్ పిలిచారు వెళ్లిపోయాను. మనసుమాత్రం అతనిగురించే ఆలోచిస్తుంది. ముఖ్యంగా అతనిచావు, బ్రతుకు మొదలైన విషయాలమీద నా మనస్సు ఉండి పోయింది.

అతని విడుదల రేపేఅని తెలిసింది. అతన్నిగురించే నాలో ఎన్నో ఆలోచనలు సుడిగాలులులేచాయి. కాని మరుసటిరోజు నేనా పేషంటుఉన్న చోటికి వెళ్ళేసరికి చాలఆలస్యమైంది. ఏదో అత్యవసరమైన కేసువిషయమై డాక్టరుకు సాయపడడంలో ఉండిపోయాను వెళ్ళిచూడగా అతడున్న బెడ్డు ఖాళీగాఉంది. అతన్నిగురించి తెలుసుకోవాలని ఎందుకో మనసు ఆరాట పడింది. ఇంతకుముందే నాకీఆలోచన యెందుకు కలుగలేదో నాకు బాధ అని పించింది

ప్రయత్నించి అతని వివరాలన్ని తెలుసుకొన్నాను. ఊరు, తల్లి దండ్రులు – సరిగ్గా ఆ రాజారావు నా బావే అని తెలిసిపోయింది. చెప్పలేని ఆవేదన నాలో కలిగింది. నిస్తబ్దనయ్యాను. వెంటనే నాకో ఆలోచన తట్టింది కొన్నాళ్ళపాటు సెలవుపెట్టి ఊరు వెళ్ళి మళ్ళీ బావను చూడాలని మనసు ఉబలాటపడింది. ఆ ప్రయత్నంలో ఉండిపోయాను కానీ రాధా! దైవం అనుకూలించడం లేదు. మళ్ళీ పిడుగులాంటి దుర్వార్త ఎదురైంది. 'బొండిలా'లో చైనావాళ్ళ దురాగతంతో భారతీయులనేకులు క్షతగాత్రులై నారనీ, ఇక్కడినుంచి కొందరితోపాటు నేనుగూడ వారి సేవ చేయడానికి వెంటనే నిమిషాలమీద వెళ్ళిపోవాలని తాఖీదు అందింది. తాఖీదు అంద డమూ, 'బొండిలా'కు వెళ్ళిపోవడమూ అంతా కొద్ది కాలంలోనే జరిగి పోయింది. ఆనాడు నేనెంత బాధపడ్డానో భగవంతుడికే తెలియాలి. భగ వంతుణ్ణి ఈ లోకాన్ని ఎంతగానో తిట్టుకొన్నాను. కాని రాధా! అంత

# "పరిస్థితుల ప్రభావం"

"రెడ్డిగారూ! మీరు చేసిన మేలుకి జీవితాంతం కృతజ్ఞుణ్ణి." — అన్నాడు ఆనందంతో చంద్రారెడ్డి నుద్దేశించి జగన్నాథం.

"నీ పీ మాత్రానికే ఇదై పోతే ఎట్లా? ఇది నాధర్మం" — అన్నాడు చంద్రారెడ్డి.

"కాని రెడ్డిగారూ! సర్వాన్ని కోల్పోయిన నన్ను మీరు దేవుడిలా ఆదుకొన్నారు. మీ ఉపకృతికి ప్రతికృతిగా ఏమి చేయగలనో తోచటం లేదు."

"నీవేమీ చేయక్కరలేదు ఒక సంసారాన్ని నిలబెట్టగలిగాను. నాకంతే చాలు."

"ఇంతవరకు నా జీవితంలో ఓటమి అంటూ లేదు. కాని ఈ నాటి కది సంభవించింది. కలిగింది గదా? సర్వమూ ఊడ్చుకొనిపోయింది."

"ఇప్పు డా విషయాన్ని యోచించి బాధపడకు. అయిందేదో అయింది. గతాన్ని త్రవ్వి ప్రయోజనమేమిటి? కావలసినంత కాలం ఈ యింట్లో ఉండవచ్చు. నీ అదృష్టం సరిగా ఉంటే తిరిగి సంపాదించినవాడు వలసినచోటికి పోవచ్చు. జగన్నాథం! సొంత అన్నయ్య అనుకో నన్ను. ఇక్కడ నీవున్నంత కాలం నీకే లోటు రాదు హాయిగా, ఆరాసోగా ఉండొచ్చు."

"లక్ష్మి తప్ప, నా అన్నవాళ్ళకి నోచుకోని నాకు మీరు లభించారు. ఆపత్సమయంలో ఆదుకొన్నారు. దుర్మార్గులు రాముడు, కోటయ్యలు చేసిన కుట్ర ఫలితమిది."

"కొద్ది రోజులనుంచి వాళ్ళిద్దరు చేయిచేయి కలిపారు. దొంగవెధవ లిద్దరూ కలిశారు. అన్యాయానికి పాలుపడ్డ వాళ్ళుమాత్రం సహించకపోతారా!"

"అదిగాదు రెడ్డిగారూ! మీరూ, అనండి. మోసాన్ని మోసంతోనే జయించాలి. 'జగమొండి' సాయంతో వాళ్ళకి కావలసినంత పని చేయిస్తాను."

"కాని ఆ రోజులుగూడ రాకపోవు. మనకు దైవానుకూలం లభించేంత వరకు వేచిఉండాలి. నీవు కాస్త మనస్థిమితం కలిగిఉంటే అదేచాలు. ఈ యిల్లు నీదే అని మసలుకో. నీకే అభ్యంతరమూ లేదు. అలా వెళ్ళి వస్తా...." అంటూ చంద్రారెడ్డి వెళ్ళిపోయాడు.

జగన్నాథం చంద్రారెడ్డి ఉపకృతికి మురిసిపోయాడు. పరమానందాన్ని పొందాడు.

చంద్రారెడ్డి ఆ ప్రాంతంలో పేరుమోసిన మోతుబరి రైతు. అతనికి ఒక అన్నా, తమ్ముడు ఉన్నారు. అయినా పెత్తనమంతా చంద్రారెడ్డిదే. ఎంత తిన్నా తరుగని, తాతముత్తాతలు సంపాదించిన ఆస్తిపాస్తులున్నాయి. అందులో మంచి అదృష్టవంతుడు రెడ్డి. అతని కేవిధమైన లోటు లేదు.

ఐశ్వర్యవంతుణ్ణి గదా అని గర్వం ఏ కోశాన లేశమైనా లేదు చంద్రారెడ్డికి. అతడు వ్యక్తిగా చాల ఉదారుడు; సానుభూతి గలవాడు; సుతిమెత్తని వాడు; దయాదాక్షిణ్యాలు కలవాడు. దుర్మార్గాన్ని దుర్మార్గంతోనే జయించాలనే స్వభావమతనిది. ఇంత సుగుణవంతుడయినా కొంత అవగుణమతనిలో లేకపోలేదు. అతనికొక్కటే వ్యసనం; అదే పేకాట. పేకాట ఒక మత్తులాంటిది. అలవాటుపడ్డాక దానికి దాసుడు కావలసిందే. పేకాటంటే చెవి కోసుకొంటాడు చంద్రారెడ్డి.

లోకంలో తిరుగుతూన్న జగన్నాథం పేకాటలో మిత్రుడయ్యాడు రెడ్డికి. అతని వృత్తి పేకాట. ఆ పేకాటలోనే కొద్దిపాటి ఆస్తిగూడ సంపాదించాడు. కాని ఏమి దురదృష్టమోగాని ఒకరోజు సర్వస్వం కోల్పోయాడు; బికారయ్యాడు. అతని దుస్థితినిగాంచి అందరికిమల్లే నే జగన్నాథానికి ఆశ్రయమిచ్చాడు చంద్రారెడ్డి తన యింట్లో.

జగన్నాథం భార్య లక్ష్మి. లక్ష్మి తాళిగట్టిన భార్య కాకపోవచ్చు; అయినా వాళ్ళిద్దరూ చాల అనురాగంతో ఉండేవాళ్ళని చెప్పుకొనేవాళ్ళు జనులు. జగన్నాథానికి బాగా డబ్బు దస్కం ఉన్నరోజుల్లో వాళ్ళకి అనుబంధం కలిగిందట। పేకాటలో సర్వనాశనం చేసుకొని లోకంలో తిరుగుతున్నాడు. లక్ష్మి చాల మంచిది గనుకనే బికారయ్యాడు గదా అని జగన్నాథంని వదలిపెట్టి పోలేదు. ఏ పూటకాపూట పొట్టపోసుకుంటూ, తిరుగుతూండగా చంద్రారెడ్డితో సఖ్యం కుదిరింది. చంద్రారెడ్డి ఇంట్లో చాల హాయిగా గడచిపోతున్నాయి రోజులు.

ఎంత మంచివాడైనా, చెడ్డవాడైనా, పరిస్థితులవల్ల, పరిసర వాతావరణంవల్ల అందుకు భిన్నంగా తయారుకావచ్చు. పరిస్థితుల పరిణామంతో, ఒక రకం మనస్తత్వం గల వ్యక్తి తద్భిన్నంగా మారవచ్చును. కాని అందరూ తప్పనిసరిగా మారిపోవాలని మాత్రం లేదు. కనుక అది వ్యక్తిమీద ఆధారపడుతుంది. ఇదెంత వ్యక్తిమీద ఆధారపడినప్పటికి, ఎట్టివారైనా పరిస్థితులకు బానిస మాత్రం కాకతప్పదు. అందుకే మానవులు పరిస్థితుల బానిసలు।

అస్తమిస్తున్నాడు సూర్యుడు. అరుణారుణ రాగరంజితమైంది పశ్చిమ దిశ. క్రమంగా ముసురుకొంటున్నాయి మునుచీకట్లు. గడ్డివాములో ఏ మాత్రమూ లేదు సందడి. పనివాళ్లు, ఇంటివాళ్లు, జీతగాళ్లు ఇంకా తిరిగి

రాలేదు పొలం నుంచి. కాని రోజు ఇదే సమయంలో రెండు కంఠాలు మాత్రం గడ్డిచాటున గుసగుసలాడుతుంటాయి.

"ఏమిటి రోజు ఆలస్యంగా వచ్చావే: నాకు వ్యవధి లేదనే విషయం తెలీదా?" – అంది ఓ పురుషకంఠం చిరుకోపంతో.

"చూడండి. మీరు కొంచెం ఓపిక పట్టాలి. లేకపోతే బయటపడి పోతుంది మన గుట్టు" – అంది స్త్రీ కంఠం.

"అయినా గుట్టు బయటపడితే మాత్రం మనల్ని ఎవరేం చేయ గలరు? నీ భయంగాని."

"మరి మీకు భయం లేకపోతే భార్యలాగ నన్నేలుకోరాదూ?"

"ఆ రోజులుకూడ దగ్గర్లోనే ఉన్నాయి ఎందుకాత్రం."

"నిజంగా ఆ మంచిరోజులు వస్తాయంటారా?"

"ఓ! తప్పకుండా! మనమనుకోవాలే గాని! అలాంటి శుభదినాలు రాక పోవటం గూడానా? కానీ........"

"సందేహిస్తారెందుకు? చెప్పండి. కానీ........"

"కానీ.... ఒకటే ఆటంకం........"

"ఆటంకమా! ఏమిటది?"

"మన ప్రేమలతకు విరుగుడు, అశనిపాతం...."

"అబ్బబ్బ! విసిగించక చెప్పండి...."

"జగన్నాథం............"

ఏమీ తోచక బేజారెత్తి అటూ ఇటూ తిరుగుతూ, సరిగ్గా అదే సమ యంలో గడ్డివామి ముందుకొచ్చాడు జగన్నాథం. ఆ మాటవిని ఆగి పోయాడు. వింటున్నాడు.

"ఎక్కడ?........" – అంది శ్రీకంఠం కంగారుగా అన్నివైపులా పరికిస్తూ.

"అబ్బా! ఏమీలేదు. మన ప్రేమమార్గంలో కంటకింపుగా ఉన్నాడు జగన్నాథమన్నాను. అంతే!"

"ఆఁ ఏమిటో గుండె దడదడలాడి పోతుందండి."

"ఎందుకు? నేనుండగా!"

"ఏమో! సర్వం నాకు మీరే!"

"పిచ్చిదానా! ........."

"....................."

"....................."

జగన్నాథం తెలుసుకొన్నాడు. సుపరిచిత కంఠాలే! పసిగిపోయాడు. చెప్పరాని కోపం వచ్చింది. పటపటమని పండ్లు కొరికాడు గుడ్లురిమాడు. కాని ప్రయోజనం? ఇది పేదవాని కోపం! రోజూ ఈ వేళప్పుడు తాను ఒంటరిగా ఉండిపోవడానికి కారణమిదని గ్రహించాడు ఒళ్ళు మండి పోయింది. తేళ్ళు జెఱ్ఱులు ప్రాకినట్లయింది. అప్పుడేమైనా చేయగండు. రెండు కంఠాల్ని నులిమి పారేద్దామా అని ప్రయత్నించాడు. కాని పరిస్థితులు అడ్డొస్తున్నాయి; తమాయించుకొన్నాడు. ఉండబట్టలేక దంగుమని దగ్గాడు.

లోపలున్న ఇద్దరు వ్యక్తులు విన్నారు. గడ్డిచాటున స్త్రీ నక్కింది. కంగారుగా పురుషుడు బయటికి వస్తూ, జగన్నాథంని చూసి గతుక్కుమన్నాడు. ఆ వ్యక్తి ముఖం చూడదలచుకోలేదు. జగన్నాథం ప్రక్కకు తిరిగాడు. ఇదే సందనుకొని ఆ వ్యక్తి మెల్లగా జారుకొన్నాడు.

ఒక్క ఉదుటున లోపలికివెళ్ళాడు జగన్నాథం. కోపంతో వెర్రెత్తిపోయింది. "లక్ష్మీ...... ......"అంటూ బిగ్గరగాఅరచి కుత్తుక నులిమేందుకు ప్రయత్నించాడు. గడ్డివామిచాటున నక్కిఉన్న లక్ష్మి గజగజలాడిపోయింది. దానిఅవస్థ చూసి జాలివేసింది జగన్నాథంకి.

గడచినరోజులు గుర్తుకొచ్చాయి. ఏవిధంగా లక్ష్మి తనదయింది అంతకుపూర్వం లక్ష్మి జీవితమేవిధంగా వెళ్ళబుచ్చింది మనస్సులో మెదిలాయి చాల మెత్తబడిపోయాడు. దాని స్వభావమే ఇంతనుకొన్నాడు. అక్కడుండలేక మనస్థిమితంకోసం కాలువవేపున నడిచాడు భయంభయంగా ఇంటికిపోయింది లక్ష్మి.

చంద్రారెడ్డికిగాని, లక్ష్మికిగాని ఆరాత్రి మనసు మనసులోలేదు. వాళ్ళకి అన్నంగూడ నహించలేదు. జగన్నాథం మాత్రం ఏ మార్పులేక మామూలుగ ఉన్నాడు.

చంద్రారెడ్డికి ఆరాత్రి నిద్రపట్టలేదు. మనస్సు పరిపరివిధాలా యోచిస్తూంది. జగన్నాథంని ఈ పరిస్థితుల్లోచూస్తూంటే జాలివేస్తూంది. కాని లక్ష్మి గుర్తుకువస్తేమాత్రం అతనిమీద ఈర్ష్య, ద్వేషం పుట్టుకొస్తున్నాయి. లక్ష్మిమీద రోజురోజుకు మోజు పెరిగిపోతూంది.

*　　*　　*

ఏదో పండుగరోజు. బాగా అలంకరించుకొంది లక్ష్మి చంద్రారెడ్డి చూశాడు లక్ష్మిని, కన్నువేశాడు: మనస్సుని అదుపులో పెట్టుకోలేకపోయాడు. లక్ష్మి చాలమంచిదే। అయితేమాత్రం। దారిద్ర్యంతో విసిగి వేసారిపోయిన లక్ష్మి, చంద్రారెడ్డి ఆ ఠీవీ, దర్పాన్ని, దబ్బుని, పలుకుబడిని, అన్నిటికంటే ఆ ఆజానుబాహు విగ్రహాన్నిచూసి మురిసిపోయింది అతనిని కాదనలేకపోయింది. లక్ష్మికి ముప్ఫైఏళ్ళ వయస్సేకావచ్చు. చాల నాజూగ్గాఉంటుంది. అందులో పేమదిరిగిన సీమంతిని। పర్యవసానం

చం[ద్రారెడ్డి లక్ష్మివల్లో తగుల్కొ_ఉం. అయినా ఆడదానిముందు మగ వాడెంత ? నిప్పుముందు వెన్నముద్ద! అంతే చం[ద్రారెడ్డి [దవించి పోయాడు. జగన్నాథమీవిషయాన్ని ఎప్పుడో పసిగట్టాడు కన్నులారా చూశాడు. కాని ఆ పరిస్థితుల్లో ఏమిచేయడానికి గత్యంతరంలేక ఏదో విధంగా రోజులు గడిపేస్తున్నాడు.

చం[ద్రారెడ్డి లక్ష్మివ్యామోహంలో పడిపోయాడు. జగన్నాథం మా[త్రం కంటగింపుగాఉన్నాడు. అతడు పైదొలగిపోతే హాయిగా లక్ష్మితో కాలం గడుపవచ్చు ననుకొన్నాడు. బాగా యోచించాడు జగన్నాథంనుంచి తప్పించుకోటానికొక్కటే మార్గం! ఇందుకు లక్ష్మి [ప్రోద్బలంగూడ లేకపోలేదు, అందుకు తన మనోబలంతోడైంది. ఆ రెండుశక్తులు ఏకమై ఒక నిర్ణయానికొచ్చాయి.

*　　　　*　　　　*

ఒకరా[త్రి. అమావాస్యకాబోలు గాఢాంధకారం. పట్నంలో రెండో సినిమాచూసి, చం[ద్రారెడ్డి, జగన్నాథం రెండెడ్ల బండిలో తిరిగి వస్తున్నారు. ఈవిధంగా సినిమాకి వెళ్ళిరావటం వాళ్ళకి మామూలే. చం[ద్రారెడ్డి జీత గాడు రంగడు బండితో లున్నాడు. వాడు చం[ద్రారెడ్డికి నమ్మినబంటు.

"రెడ్డిగారూ! మీరు రమ్మంటే కాదనలేకవచ్చాను రెండో సినిమాకి. ఉదయంనుంచి నాకదోలాఉంది ని[దమత్తు వదల్లేదు సినిమాలోగూడ మధ్యమధ్య ని[దపోతూనే ఉన్నాను."

'నిజమే జగన్నాథం! ఆవిషయం నేను [గహించాను. అయినా సినిమా చాల బాగుంది."

"కాని సినిమాలో దొంగవెధవలిద్దరు దొంగిలించిన సొమ్ములో వాటాలు కుదరక ఒకడు మరొకణ్ణి హత్యచేస్తాడు. అదిమాత్రం చాలా దారుణంగా ఉంది."

చంద్రారెడ్డి ఆ మాటలువిని ఉలిక్కిపడ్డాడు మాట్లాడలేదు

"రెడ్డిగారూ! నాకు ఉదయంనుంచిగూడ భయంగా ఉంది ఎందుకో, అయినా దేవుడేదిక్కు. నాకు నిద్రవస్తూంది పడుకొంటాను."—అని బండిలో నిద్రపోవడానికుపక్రమించాడు జగన్నాథం.

"సరే"—అంటూ తానుగూడ నిద్రపోతున్నట్టు నటించాడు చంద్రారెడ్డి.

జగన్నాథం నిద్రవస్తుందన్నాడేగాని మగతగా ఉంది. ఎంతసేపు సినిమాలో హత్యసీనే గుర్తుకొస్తూంది. ఎంత మంచివాడైనా ధనాశాపీడితుడైనవాడు ప్రాణస్నేహితుణ్ణిగూడ హత్యచేయడానికి వెనుదీయడు. ఈ విషయమాలోచిస్తుండగానే తన్నేదోశక్తి ఆవహించినట్టయింది. నిద్రలాంటి మత్తులో మునిగిపోయాడు.

సగందూరం వచ్చారు ఆ దట్టమైనఅడవిలో గుబురుపొదల్లోంచి వస్తూంది బండి ఆపాటికి బండికి ముందరగట్టిన లాంతరుగూడ ఆరిపోయింది ఈదరగాలికి.

చంద్రారెడ్డికి నిద్రపట్టలేదు. ఊహాపోహలతో తలబరువెక్కింది. జగన్నాథం గుర్రుపెట్టుతూండగా గాఢనిద్రలో ఉన్నాడని గ్రహించాడు చంద్రారెడ్డి ఆజ్ఞాపించాడు రెడ్డి బండిని గుబురుపొదల్లోకి తిప్పాడు రంగడు భయంభయంగా బండిఆగింది.

రెడ్డి ఒక్కక్షణం తటపటాయించాడు. బండిలో రహస్యంగా దాచి ఉంచిన వేటకొడవలి తీశాడు. చేతులు వణకాయి. కొడవలి ఎత్తాడు.

చంద్రారెడ్డికిగాని, రంగనికిగాని రేయింబవళ్లు కంటిమీద కూర్కే లేదు. కన్నుమూస్తే ఒకటే కలవరింతలు, పలవరింతలూను! చిటికెలో ఈవిషయం ఊరంతా ప్రాకిపోయింది ఇదే సదవకాశమని ఎరిగిన చంద్రారెడ్డి ఎదురుపార్టీవాళ్ళు పోలీసులకి తగిలించారు మెల్లగా చల్లగా! చంద్రారెడ్డిని, రంగడిని వెంటనే అరెస్టుచేశారు. జెయిల్లో ఉంచారు.

దాంతో లక్ష్మిగుండె జారిపోయింది. ఏవిధంగాను చంద్రారెడ్డి తిరిగిరాడనే నిర్ణయించుకొంది. పరిస్థితులు విషమించాయి! చంద్రారెడ్డి ఎదురుపార్టీవాళ్ళకి అనుకూలంగా సాక్ష్యమివ్వదల్చుకొంది మొదట కాని తీరా వాయిదానాడు సాక్ష్యం ఇవ్వలేకపోయింది ఆ తరువాత కనిపించనే లేదు లక్ష్మి!

కేసును రద్దు చేయించడానికి, చంద్రారెడ్డి అన్నదమ్ములు చాల ధన వ్యయం చేశారు. హైకోర్టుదాక వెళ్ళింది కేసు కోర్టులో సత్యం అసత్యంగాను, అసత్యం సత్యంగాను మారిపోతుంది డబ్బుముందు ఏది నిలవగలదు? డబ్బుంటే ఈ కాలంలో పంది వందిగాను నంది పందిగాను మారిపోగలదు!

కాని ఆ సమయంలో చాల గమ్మత్తు జరిగింది జగన్నాథం హత్య విషయం పోలీసులు దర్యాప్తుచేస్తుండగా, హత్యకు సంబంధించిన విషయాలన్నీ తెలిపోయాయి. జగన్నాథం శవం, హత్యచేసిన వేటకొడవలి__ అన్నీ లభించాయి. ఇంతకంటే కావలసిందేముంది?

చంద్రారెడ్డి జెయిల్లోఉండగా హత్యకు సంబంధించిన విషయాలన్నీ కలవరింపుకొనేవాడట: జగన్నాథంని ఎక్కడ, ఏ వేళప్పుడు చంపింది,

శవాన్ని, కొడవలిని దాచింది, రంగడు తనకి సాయంచేసింది_మొదలైన సంగతులన్నీ కలవరించుకొనేవాడట ! దీన్ని పసిగట్టిన సి.ఐ.డి.లు చేప్పు రికార్డుచేశారు. ఇది బలవత్తరకారణం కదా ? ఇందులో రంగడు విక్షోషని విడుదలచేశారు. చంద్రారెడ్డికిమాత్రం యావజ్జీవ కారాగారశిక్ష విధించారు !

కాంతాకనకాలు క్షణికాలే కావచ్చు కాని అందరి వ్యామోహం మాత్రం చాల గొప్పది. మానవుడు క్షణంలో దానవుడుగా మారిపోవచ్చు, లేదా దైవత్వాన్నైనా పొందవచ్చు దాన్ని నిర్ణయించేది పరిస్థితులు ! !



# 'విధి బలీయం'

శరవేగంతో వెళ్తున్న రైలు ఠకీమని ఆగిపోయింది. క్రిక్కిరిసి ఉన్న జనం ఒకరిమీదొకరు పడ్డారు దెబ్బలు తిన్నవాళ్లు దీవెనలిస్తున్నారు. 'ఇందులో ఎవరి తప్పేముంది? రైలాగినందువల్ల పడ్డారంతే!' అంటూ ఇంకొంతమంది సమాధానాలిస్తున్నారు. ఈ గందరగోళమంతా కొంత సర్దుబాటైనాక "ఈ అరణ్యమధ్యంలో రైలెందుకాగి పోయిందా?" అనే ప్రశ్న అందరి తలల్లోను మెదిలింది. కొద్ది క్షణాల్లో రైలుపట్టాలు వైదొలిగాయట, డ్రైవర్ ప్రజ్ఞా విశేషంవల్ల ఆ విషయాన్ని గ్రహించి సడెన్‌గా బ్రేక్ వేశాడట! అనే సమాధానం కూడ వచ్చింది. అతని అనుభవానికి, ప్రజ్ఞకి ప్రయాణీకులంతా మెచ్చుకొన్నారు. ఎంతో సంతోషించారు లేకపోతే ఈ పాటికి ప్రదేశమంతా రుద్రభూమిగా మారిపోయేది తమకింకా భూమిమీద ఉప్పుందనుకొన్నారు ప్రయాణీకులు.

ఇంకా ఐదారు గంటలకిగాని రైలు కదలదన్నారు. అటూ ఇటూ తిరుగుతున్నాను ఒకవైపు కొండలు, గుట్టలు. దట్టమైన పొదలు, మరొక వైపు గడ్డిమైదానాలు కనిపిస్తున్నాయి. కాని దగ్గర ప్రాంతంలో జననివాసమున్నట్లు మాత్రం గోచరించలేదు కాని ఇంతలోనే మంచినీళ్లు, మజ్జిగ ప్రయాణీకుల కందజేసున్నారు కొంతమంది. మరి కొంతమంది చిన్నపిల్లలకు అన్నంకూడ అందజేస్తున్నారు. అప్పుడు సాయంత్రం నాలుగు గంటలు కావస్తూంది. ఇంకా పది పన్నెండు మైళ్లు వెళ్లేగాని ఆహార పానీయాలు లభించవు. అందులోను ఇంకా అయిదారు గంటలకిగాని రైలు కదలదు. ఇలాంటి దుస్థితిలో ఇంతమంది ప్రయాణీకులకి అన్నపానీయాలందజేసిన మహాత్ములెవరా? అని యోచించాను. కనుచూపుమేర దూరంలో కూడా పల్లెపట్టులున్నట్టు కనిపించవే! అనుకొంటూండగా ఎవరో చెప్పారు.

మేస్తున్నాయి చిన్నపిల్లలాడుకొంటున్నారు గోశాలలు ప్రత్యేకంగాను, మనుష్యులకి వాసయోగ్యంగా ఉండే కుటీరాలు ప్రత్యేకంగాను తోటబయట ఉన్నాయి. అవన్నీగూడ చాల నిరాడంబరంగాను, మనోహరంగాను ఉన్నాయి. బహుశా ఆ ఆశ్రమంవల్ల జీవించే వారనుకొంటాను – వాళ్ళ వాళ్ళ పనుల్లో నిమగ్నులై ఉన్నారు. తోటలోంచి వెళ్తున్నాం. శ్రావ్యమైన కంఠం భగవద్గీతాపారాయణం చేస్తూన్నట్టుంది చాల దగ్గరకెళ్ళాం. స్వాములవారి గడ్డం, జుత్తు పెరిగిపోయి నల్లగా నిగనిగలాడుతున్నాయి. మొత్తం ఆ కేశాలమధ్యన వారి ముఖం, కారుమేఘాలమధ్యన చంద్రబింబంలా మెరిసిపోతూంది స్వాములవారి ముఖంలో ఏదో మహత్తర శక్తి కొట్టొచ్చినట్లు ప్రస్ఫుటమౌతూంది. మతం ఓ ప్రక్కవారగా నిల్చొండిపోయాం.

భగవద్గీతా శ్లోకాల్ని మృదుమధుర కంఠంతో చదివారు స్వాముల వారు. గీతాపారాయణం పూర్తి అయ్యేంతవరకు అలాగే ఉండిపోయాం. మేం వెళ్ళిన కొద్ది క్షణాల్లో ముగిసింది పారాయణం.

స్వాములవారు తల పైకెత్తి చూశారు. వారి ముఖంలో ఆనందాశ్చర్యాలు ముడిపడుతూండగా 'జానకీ!' అన్నారు హఠాత్తుగా. నేను తికమక పడిపోయాను. ఆ పేరుగల వాళ్ళెవరైనా ఆశ్రమంలో ఉండొచ్చను కొన్నాను. కాని పరిచిత స్వరంవలె ఉంది. 'నేను జానకి!' అన్నారు ఆనకితో. ఈసారి స్వాములవారు చాల పరిచయస్థులే అనుకొన్నాను. 'జానకి రామారావు! నేను నాయనా!' – అన్నారు స్వాములవారు. నా అసలుపేరు 'జానకి రామారావు'. అమ్మానాన్న, ఆప్తమిత్రులు 'జానకి' – అంటారు ముద్దుగా. అప్పటికిగాని నేను గుర్తుపట్టలేకపోయాను. అసలు సంగతి తెలుస్తూంది. 'నేనే నాయనా! పూర్వాశ్రమంలో సదానందరావుని'. అన్నారు గాంభీర్యంగా. నేను దగ్గరికెళ్ళి కూర్చున్నాను. నాతో వచ్చిన

పెద్దమనిషిని గూడ ఆహ్వానించారు స్వాములవారు వారు ఆతిథ్యం ఇచ్చారు. స్వీకరించాం.

ఒకనాడు సదానందరావు నాకు చాల ముఖ్యస్నేహితుడై నప్పటికి, ఈనాడు సదానందస్వాములవారయ్యారుగనుక 'స్వామీ' అని మాత్రమే సంబోధించాను. 'సుమారు పదేళ్ళతర్వాత ఈమహాపర్వదినంనాడు ఎక్కడో అరణ్యమధ్యంలో తమ ఆశ్రమంలో మన కలయికస్వామీ ! తమ దర్శన భాగ్యంవల్ల నా హృదయం ఆనందోత్సాహాల్తో గంతులేస్తూంది. సంసార సాగరంలో హాయిగా సాగిపోయే మీ దాంపత్యనౌక కంతరాయం ఎట్లా కలిగింది ? ఎందుకీవైరాగ్యం ? ఎన్నాళ్ళనుంచి ? వినాలని కుతూహలంగా ఉంది చెలవిస్తారాస్వామీ ?"—సంభ్రమాశ్చర్యాల్తో అడిగాను.

"జానకీ ! అదంతా స్వప్నజగత్తులోని మధురానుభూతి. దానివనుస రించే జీవితాంతం మరపురాని ఆవేదన. ఆ వేదనని మరచిపోవాలనే ఈ ప్రయత్నం.

'మరచిపోవాలన్న అనుభూతుల్ని తమస్మృతికి దెచ్చి బాధకలి గించాను. క్షమించండిస్వామీ !'

'అదేమీగాదు జానకీ ! నా ఆప్తమిత్రుని ముందు నా కష్టాలన్నీ వెళ్ళబోసుకొంటే హృదయభారం తగ్గుతుంది. కాని మన పరస్పరసంద ర్శనంమాత్రం ఆశ్చర్యంగాఉంది. నేనిక్కడున్నానని నీకెలాతెలుసు ? తెలిస్తే ఎలావచ్చావు ? అడిగారు స్వాములవారు.

నా ప్రయాణం, రైలాగిపోవడం మొదలైనవన్నీ చెప్పాను.

'సరే. అంతా దైవేచ్ఛ జానకీ ! మనశ్శాంతికోసం ఆంధ్రదేశం లోనేగాదు-మొత్తం భారతవర్షంలో నేను దర్శించని దేవుడుగాని, నేను

తీర్థగని యాత్రాస్థలంగాని లేవు. కాశీ, ప్రయాగ, బుద్ధగయ — ఇత్యాది ప్రదేశాలన్నీ తిరిగాను. చివరికి హృషీకేశంలో నా మనస్సు-కొంత కుదుటబడింది. అక్కడ దాదాపు మూడుమాసాలపాటు ఉన్నాను. గొప్ప గొప్ప ఆధ్యాత్మికవేత్తలనుంచి ఉపదేశం పొందాను. తత్ఫలితమే ఈ ఆశ్రమ నిర్మాణం.

"ఈ ప్రదేశంలోనే ఆశ్రమం నిర్మించటానికి ఒక కారణంగూడ లేకపోలేదు. ఆంధ్రదేశంలోని పుణ్యక్షేత్రాల దర్శనార్థం యాత్రచేసేటప్పుడు ఒకసారి ఈ మార్గంగుండా రైల్లోవెళ్ళటం తటస్థపడింది. అప్పుడీ టర్నింగ్‌లో రైలు ప్రమాదం జరిగింది. ఆ ప్రమాదంలో పోయినాబాగుండును కాని ఆవిధంగా జరుగలేదు. నేను బ్రతికిబయటపడ్డాను. చాలమంది మరణించారు. అనేకులు గాయపడ్డారు. తరచు ఈ ప్రదేశంలో రైలు ప్రమాదాలు జరుగుతూంటాయని చెప్పారు. అందువల్ల హృషీకేశంనుంచి వచ్చాక ఇక్కడ ఆశ్రమం నిర్మించాను. ఎలాంటి ప్రమాదం సంభవించినా ఈప్రాంతంలో ఆదుకొనే వాళ్లులేరు. అందుకని ఇదే సరైనస్థలమని ఎన్నుకొన్నాను. ఈ విధంగా అనాథులకి ఆశ్రయమిచ్చాను.

"ఆశ్రమంలో ముఖ్యమైనవిధులు మూడు. ఒకటి—మూడు కాలాల్లోను గీతాపారాయణం, రెండు—గోవుల్ని పెంచి, గోమాతని పూజించటం, మూడు— దీనజనులసేవ. వీటికోసం నా శక్తివంచనలేకుండా ప్రయత్నిస్తున్నాను. నా మనోవ్యథకి గీతాపారాయణం పరమౌషధం. దాని తర్వాత గోమాతపూజ. నాకు కావలసింది మనశ్శాంతి. మనశ్శాంతిని వీటివల్ల పొందగల్గుతున్నాను—అని స్వాములవారు చెప్తూండగా మధ్యలో "స్వామీ! మనశ్శాంతి కోల్పోవటానికి కారణమేమిటి? తమ శ్రీమతి విమలాదేవి గారెక్కడ?"—అడిగాను.

స్వాములవారు నిట్టూర్చిచెప్పారు. 'జానకీ, అది మూడేళ్ళనాటి మాట. అడిగావు గనుక చెప్తున్నాను. కాలగమనంలో జరిగేవాటిని గురించి గాని భగవానుని లీలావిలాసాలు ఫలానా అనిగాని చెప్పలేం. జరుగవలసింది జరిగి తీరుతుంది. అది ప్రకృతి నైజం. ప్రతిజీవి తన కాలంలో అనేక విధాలైన మలుపులు తిరుగవలసి ఉంటుంది. అందుకే మానవజీవితం ఎక్కడో తప్ప — నిమ్నోన్నతాలమయం. నా విషయంలో కూడ అదే జరిగింది. విమలా, నేను ఆంధ్రా యూనివర్శిటీలో ఉపన్యాసకుడుగా పని చేస్తూండడం నీవెరిగిన విషయమే. హాయిగా ఖులాసాగా గడిచిపోతున్నాయి రోజులు. విమల కడుపు పండింది. వంశోద్ధారకుడు పుట్టబోతు జన్మిస్తాడని మేమెంతో సంతోషించాం. ఆ సమయంగూడ రానే వచ్చింది. విమలకి ప్రసవవేదన భరింపరానిదయింది. వాల్తేరు 'కింగ్ జార్జ్ హాస్పిటల్'లో విమలని అడ్మిట్ చేశాను. ఎక్స్‌పర్ట్స్ అయిన లేడీ డాక్టర్లెంతో మంది పరీక్షించారు. గర్భంలోనే బిడ్డ చనిపోయిందని, ఆపరేషన్ చేయాలని అన్నారు. ఆపరేషన్ తర్వాత విమల జీవించటం నా అదృష్టమని కూడ చెప్పారు. విమల పడుతూన్న నరకయాతనను చూచి సహించలేక ఆపరేషన్ చేయించాను. ఇంకేముంది? కొద్ది క్షణాల్లో నా విమల........నన్ను........వదలిపోయింది........ జానకీ! వదలిపోయింది' — రుద్ధకంఠంతో అన్నారు స్వాములవారు. రెండు బాష్పకణాలు రాలిపోయాయి. కొద్ది క్షణాల తర్వాత ఇలా చెప్పారు. 'అంతటితో నా ఆశాజ్యోతి ఆరిపోయింది జానకీ! ఎవరి కోసం నేను జీవించానో, ఎవరి అనుబంధంతో నా జీవితం స్వర్గతుల్యమౌతుందని ఆశించానో, వాళ్ళే నాకు దూరమైనప్పుడు నేను జీవించి ప్రయోజనమేమి? దాంతో నా మతి చలించింది. అందుకే భారతదేశమంతా తిరిగాను మనశ్శాంతి కోసం.

'నాకు సంక్రమించిన ఆస్తికి నా తర్వాత వారసులులేరన్న విషయం నీకు తెలుసు. హృషీకేశం నుంచి వచ్చినాక ఉన్న ఆస్తిని సద్వినియోగం

చేయదలచి వినోభాజీ భూదానయజ్ఞార్థం కొన్ని ఎకరాల భూమిని దానం చేశాను. ఆంధ్రా యూనివర్శిటీ బీదవిద్యార్థుల స్కాలర్‌షిప్పు నిమిత్తం కొంత డబ్బు విరాళంగా ఇచ్చాను. ఇంకా బీదసాదలకి దానధర్మాలుచేశాను. తర్వాత ఈ ఆశ్రమం నిర్మించాను ఇక్కడగూడ నా శక్తివంచన లేకుండా దీనసేవా నిరతుడనయ్యాను. ప్రశాంతమైన మనస్సుతో చేతనైన దీనసేవ జేస్తూ ఈ విధంగా ఆధ్యాత్మిక జీవితం గడపటం నా విధి విమల నానుంచి దూరమైనాక మరో అధ్యాయం నా జీవితంలో ప్రారంభించవచ్చునే అని నీకు సందేహంగా ఉండవచ్చు. కాని విమల పోయిన తర్వాత ఐహిక సుఖాలమీద రోతబుట్టింది. నా జీవితం ఈ విధమైన పరిణామం చెందాలని బ్రహ్మ వ్రాశాడు. అంతే....' ఇక మాట్లాడలేక పోయారు స్వాములవారు.

ఈ సంగతంతా వింటూంటే నాకు షాక్ తగిలినట్టయింది. అందరూ మౌనంగా ఉన్నాం ఇంక స్వాములవారికి బాధ కలిగించ దలచలేదు 'ఇప్పటికే చాలా కాలాతీతమైంది. అప్పుడప్పుడు తమ దర్శనార్థం ఇటు వస్తూంటాను. ప్రస్తుతానికి సెలవిప్పించండి స్వామీ!' అన్నాను.

'మీకెల్లప్పుడు స్వాగతమే. ఎప్పుడైనా రావచ్చును. మంచిది. వెళ్ళిరండి జానకీ!' — అని సెలవిచ్చారు స్వాములవారు.

నేను, నాతో ఉన్న పెద్దమనిషి తిరుగుముఖం పట్టాం. నా మనస్సులో ఎన్నెన్నో ఊహాలు బయలుదేరుతున్నాయి అంతలో నాతో ఉన్న పెద్దమనిషి అడిగాడు — 'ఏమండీ! జానకి రామారావుగారూ! స్వాముల వారిని మీరెలా ఎరుగుదురు ?'

నేను చెప్పాను. 'నేను స్వాములవారు ఆంధ్రా యూనివర్శిటీలో ఒకే క్లాసులో చదువుతూండే వాళ్ళం. మాఅభిమాన సబ్జెక్టు 'ఫిలాసఫీ'. విమాలాకుమారీ జాన్ అనే అమ్మాయి ఇంగ్లీషు లిటరేచర్ చదువు

తూండేది. సదానందరావుగారు చాల ఉదారులు; దయాదాక్షిణ్యం గలవారు. యూనివర్శిటీలో చదువుతూండగానే నాటకాలువేసి, చందాలు వసూలుచేసి_ డబ్బు ప్రోగుచేసి బీదసాదలకి, వరద బాధితులకు అప్పగించేవారు. అంతే గాక ఏ 'డిబేట్'లో పాల్గొన్నా, ఏ సభలో మాట్లాడినా వారే ఫస్టు. అప్పుడు విమలాకుమారీ జాన్ కూడ నాటకాల్లో పాల్గొనేది వాళ్ళిద్దరూ నాయికా నాయకులుగా నటించేవారు ఆ విధంగా వాళ్ళకి సఖ్యం కుదిరింది. పరస్పరం ప్రేమించుకొన్నారు. పర్యవసానం పెళ్ళి చేసుకొన్నారు. విమలా కుమారీ జాన్ పెళ్ళి తర్వాత విమలా దేవిగారయ్యారు.

'వాళ్ళ పెళ్ళికిగూడ చాల ఆటంకాలు కలిగాయి. విమలా కుమారీ జాన్ జన్మతః క్రైస్తవుల అమ్మాయి అందువల్ల సదానందరావుగారి నాన్న ససేమిరా ఈ పెళ్ళి కంగీకరించనన్నారు. కాని యేదో విధంగా సర్దుబాటైంది. అప్పటికే రోగిష్ఠిఅయిన వాళ్ళనాన్న మరణించారు. తర్వాత. మొట్టమొదట వర్ణాంతర వివాహానికి దారిచూపిన ఘనత సదానందరావు గారికి దక్కింది దీనికెంతో మంది పూర్వ సాంప్రదాయకులు పెదవి విరిచి దూషించారు. సదానందరావుగారి సంఘ సంస్కరణాభిలాషికి ఎంతోమంది సంఘసంస్కర్తలు ప్రశంసించి, హర్షించారు సదానందరావుగారు దూషణ భూషణకి గురయ్యారు.

'మేము ఆఖరు సంవత్సరంలో చదువుతూండగానే వాళ్ళ పెళ్ళి జరిగిపోయింది. కష్టపడి చదివారు. వాళ్ళ సితారా అప్పటికి బాగుంది ఆనర్సులో 'రాంక్' గూడ వచ్చింది. ఆంధ్రా యూనివర్శిటీలోనే వాళ్ళిద్దరూ ఉపన్యాసకులుగా నియమింపబడ్డారు. హాయిగా జీవితం గడిచి పోతూంది ఏమాత్రం ఒడుదుడుకులు లేకుండా. ఆనర్సు తర్వాత నేను వ్యాపారంలో దిగాను పదేళ్ళ తర్వాత ఈనాడు మేము కలిశాం. వాళ్ళ దాంపత్యం మార్గదర్శకమౌతుందనీ, వాళ్ళ సంసారం స్వర్గతుల్యమనీ _

అప్పుడందరూ భావించేవాళ్లు. కాని ఈనాడు చూస్తే విపరీతం ఆనందించాల్సిన ఇంకొక్క సంగతిగూడ తేలిపోలేదు ఏమిటంటే అతివృష్టివల్ల ఒక చోట, అనావృష్టివల్ల వరొకచోట బాధపడుతూన్న ఆంధ్రలో చేతనైనంత మట్టుకుచేస్తున్న ఈ స్వాములవారి దీనసేవ ప్రశంసించదగ్గది ఇది మామూలు ప్రజలందరూ చేయలేరుగదా ? చాల కష్టసాధ్యం. ముందు సదానందరావుగారు, నేడు సదానందస్వాములవారు నాడు గొప్ప ఉపన్యాసకులు, నేడు గీతాపారాయణోపన్యాసకులు నాడు గొప్పనటకులు. నేడు నిజంగానే దీనసేవాపరాయణులు ఇది దీనసేవా పరాయణులైన స్వాములవారి చరిత్ర ఎప్పుడేమి సంభవిస్తుందో చెప్పలేం ; 'విధి చాలవిచిత్రమైంది.' అంటూ ముగించాను. ఈ కథంతావిన్న ఆ పెద్దమనిషి చాల ఆశ్చర్యపోయాడు అప్పటికే మేము రైలాగిపోయిన ప్రదేశానికి వచ్చేశాం

మేము వచ్చేసరికే రైలుపట్టాలు సరిచేశారు. అనుకొన్న కాలం కంటే ముందుగానే తయారైనందుకందరూ చాల ఆనందించారు. ప్రయాణీకులంతా మళ్ళీ రైల్లో కిటకిటలాడుతున్నారు ఆ పెద్దమనిషి నేను మా సామాను జాగ్రత్తపరచుకొన్నాం. నేనుఏదో అర్జెంటుపనుండి వెళ్తున్నాను. అనుకోకుండా ఇక్కడీ ఆటంకం. స్వాములవారి దర్శనంతో ఈ విషయమంతా మరచేపోయాను. ఇప్పటికే ఎంతో కాలాతీతమైంది. ఇంక అయిదు నిమిషాల్లో రైలు కదులుతుందన్నారు. నా మనస్సుగూడ చాల తేలికపడింది సంతోషించాను. కాని విమలా సదానందరావుల సంగతి. తర్వాత సదానంద స్వాములవారి దీనసేవ మొదలైన విషయాలే నామెదళ్లో మెదుల్తున్నాయి. నా మనస్సులో ఇంకా ఏవేవో విషయాలరైళ్ళు పరుగెడుతున్నాయి

గార్డు 'విషల్'తో ఈ లోకంలోకి వచ్చాను.

గార్డు మళ్ళీ సిగ్నల్ ఇచ్చాడు.

రైలు కూతేసింది, కదిలిపోయింది.

# కానుక

"చెల్లీ! విజయకుమార్ పెళ్ళట!"_అన్నాడు ఆఫీసునుంచి అప్పుడే వచ్చిన రాము. రాబోయే పాపాయికోసమని ఏదో అల్లిక అల్లుకుంటున్న జయ అన్నయ్యమాటతో బిత్తరపోయి చూసింది. 'నిజమా!' అన్నట్టు.

"ఔను నిజమే" అన్నాడు రాము. దాంతో జయ చేతుల్లోంచి అల్లిక పరికరాలు క్రిందపడిపోయాయి. ఆమెగుండె గుభేలన్నది.

ఆమెపెదవులు కదలబోతున్నాయి ఏదో చెప్పటానికి. అంతలోనే "ఇదిగో పెళ్ళిపత్రిక" అంటూ జయ చేతికిచ్చాడు రాము. పత్రిక చదివింది జయ, విజయ్‌కి అనసూయతో వివాహం, ముహూర్తం ఇంక పదిహేను రోజులుంది. నిర్ఘాంతపోయింది జయ. అశనిపాతంలాంటి వార్త. హృదయంపై వేయి సమ్మెటలతో కొట్టినట్లనిపించింది. జయ చేతులు గజగజ వణికిపోయాయి. జారి క్రింద పడిపోయింది పత్రిక. కన్నులు తేలవేసి స్పృహతప్పి పడబోతూంది జయ. వెంటనే "జయా!" అంటూ పొదివిపట్టుకొన్నాడు రాము.

జయ నుదుటిమీద మృదువుగా మెల్లగా నిమురుతున్నాడు రాము. పనిపిల్ల చన్నీళ్ళుతెచ్చి ఇచ్చి, విసనకర్రతో వీస్తూంది. జయ ముఖంమీద నీళ్ళు చల్లుతున్నాడు రాము. మెల్లగా కదిలింది జయ.

క్రమంగా స్పృహవస్తూంది.

చుట్టు కలయజూచింది

పూర్తిగా తేరుకుంది.

కనుకొలనులనుంచి అశ్రుకణాలు రాలిపోతున్నాయి. దుఃఖం పెల్లుబికివచ్చింది. ఆపుకోలేకపోయింది "అన్నయ్యా!" అంటూ బావురుమని ఏడ్చింది. ముఖాన్ని చేతులతో దాచుకొంది కుమిలికుమిలి ఏడ్చింది.

రాము గుండె చెరువయిపోయింది చెల్లిని ఎలా ఓదార్చాలో తెలియటంలేదు తనకు. తనకళ్ళు తడిఅయ్యాయి. జేబురుమాలుతో కన్నీలు ఒత్తుకుంటూ పలకరించడానికి ప్రయత్నించాడు పెదవులు వణుకుతున్నాయి. తన్ను తాను సంబాళించుకొంటూ "అమ్మా! జయా! నీకు చాల అన్యాయం జరిగిపోయింది తల్లీ! చాలా అపరాధం. క్షమించరానిది కాని బుద్ధి కర్మానుసారం నడుస్తుందిగదా! దీన్నంతటి ఓ పీడకలలా మరచిపో తల్లి!" అన్నాడు బొంగురుపోయిన గొంతుకతో ఓదార్పుమాటలుగా.

"ఎలా మరచిపొమ్మంటావన్నయ్యా! ఎలా మరచిపొమ్మంటావు" అంటూ రోదించింది జయ.

"చూడమ్మా! ఇలాంటి సమయంలో ధైర్యంతో పరిస్థితుల్ని ఎదుర్కోవాలి." అన్నాడు రాము చెల్లిని ఓదారుస్తూ.

జయ మౌనంగా ఆకాశంలోకి చూస్తు ఉండిపోయింది

"చెల్లీ! అమ్మానాన్నలు మనకు దూరమైపోయినప్పటినుంచి నిన్ను నా ప్రాణంతో సమానంగా చూసుకొంటూవచ్చాను నీకోసం ఎలాంటి త్యాగమైన చేయడానికి సిద్ధంగాఉన్నాను. కాని నీసుఖమే నేనుకోరేది. నీవు బాధాతప్త హృదయంతో విలపిస్తూఉంటే నేనుచూడలేను: నీవు సుఖంగా ఉండాలి. ఆనందంతో జీవించాలి. ఇంకొక్క విషయం. నా కోసమూ, నీకోసమూ కాకపోయినా నీ కడుపులోఉన్న పాపాయికోసమైనా నీవు సంతోషంగావుండాలి. నవమాసాల నిండు చూలాలివి. ఏలఘూయిత్యా

నీకి పొల్పడనని వాగ్దానంచెయ్యి తల్లీ!"—అంటూ ఆర్ద్రనయనాలతో వేడుకొన్నాడు రాము.

జయ చాలసేపు ఆలోచిస్తుండిపోయి, ఒక నిర్ణయానికి వచ్చినట్లు "సరే అన్నయ్యా! నీ మాటలు జవదాటను. నీకంటె నాకెవరున్నారు. కానీ నా కోర్కెను మన్నిస్తావుగదా అన్నయ్యా!" అన్నది.

"తప్పకుండా నీకేది ప్రియమో తప్పక దాన్ని ఆచరిస్తానమ్మా!" అన్నాడు రాము.

"అన్నయ్యా! నిజంగా నాకిప్పుడు సంతోషంగాఉంది" అంటూ తెచ్చిపెట్టుకొన్న చిరునవ్వు, బాధాగతమైన నవ్వునవ్వింది జయ.

వెంటనే "మరి నేను గనుక జీవించకపోతే...."అనబోయింది.

"ఛ! అవేం మాటలు చెల్లీ! నామీద ఒట్టే ఇంకెప్పుడు అలాంటి మాటలాడకు" అన్నాడు కోపంగా రాము.

"అలాగే అన్నయ్యా! నీ కెదురాడను. నాకోర్కె మన్నిస్తానన్నావు గనుక నాకెలాంటి చింతలేదు" అంటూ వస్తూన్న దుఃఖాన్ని ఆపుకొంది ఎంతో కష్టంతో.

ఆ మాటతో సంతోషించాడు రాము.

"అన్నయ్యా! మనం వాళ్ళ పెళ్ళికి అమూల్యమైన కానుక ఇవ్వాలి. నీవు తప్పక పెళ్ళికి వెళ్ళరావాలి" అంది జయ బాధ వేధిస్తున్నాగాని.

"తప్పకుండా వెళ్తానమ్మా. మంచి కానుక – అతని జీవితాంతం నిన్ను మరచిపోని కానుక – ఇవ్వాల్సిందే! పైగా నీకు ప్రియమైనదేదైనా చేయటానికి సిద్ధంగా ఉన్నానన్నాను గదా! నిన్ను సంతోషపెట్టడమే నా

వంతు. నాకదే పరమ సంతోషం" అని ఎంతో ఆనందంతో అన్నాడు రాము.

వేడి నిట్టూర్పులు వదలినా సంతృప్తిని ముఖంలో వ్యక్తం చేసింది జయ.

* * *

విజయకుమార్ వివాహం జరుగుతూంది అనసూయతో. పలురకాల సెంటుల ఘుమఘుమలతో, అగరువత్తుల పరిమళాలతో, పన్నీరు సువాసనతో వధూవరులలాగ ఆనందకరంగా ఉంది పెళ్ళిపందిరి. అన్ని రకాల జనసందోహంతో క్రిక్కిరిసిపోయింది పందిరి

ఎక్కడ చూసినా సంతోషం. ఎటు చూసినా ఆనందం. కాని ఆ ఆనందాన్ని పంచుకోడానికి నోచుకోని వాళ్ళుగూడ అక్కడ లేకపోలేదు. దుఃఖంలో ఆనందం పొందేవాళ్ళు ఉంటారు. ఆనందం అర్థమై చుట్టు ముట్టినా మానసికాందోళన మాననివాళ్లు ఉంటారు. సృష్టి వైవిధ్యమే అది.

మంగళ వాద్యాలు మ్రోగుతున్నాయి

వివాహ విధి ఆరంభమైంది.

పురోహితుడు వేదమంత్రోచ్చారణ చేస్తున్నాడు.

వధూవరులు శుభ్రపడమైన, దంపతుల జీవితంలో మొదటి మెట్టైన వివాహవేదికపై పెళ్ళిపీటలమీద కూర్చున్నారు.

విజయకుమార్ వివాహసమయంలో ఎంతో సంతోషంగా, ఉత్సాహంగా ఉండవలసిన విధంగా లేడు. అతని అంతరాంతరంలో అణగిఉన్న వేదన ముఖంలో చూడగలిగిన వాళ్ళకు తెలుస్తూనే ఉంది.

పెళ్లికూతురుముఖం అప్పుడే వికసించిన మల్లెపూవులాగ శళశళ లాడుతూంది.

పెళ్లికుమార్తె మెడలో పెళ్లికుమారునిచేత మంగళసూత్ర ధారణం చేయించి శాస్త్రోక్తంగా వివాహవిధి పరిపూర్తిచేశాడు పురోహితుడు.

అప్పుడే ప్రవేశించాడు ఎంతో ఆదుర్దాతో రాము. అక్కడ ఆనందోత్సాహాలు వెల్లివిరుస్తున్నాయి. అయినా ఆవేమి తనకుపట్టనట్టు ఒకప్రక్కన ఒదిగికూర్చున్నాడు తానుతెచ్చిన అమూల్యమైన కానుకతో. కొద్దిరోజులుగా షేవుచేసుకోని గడ్డంతో, మాసిన గుడ్డలతోను ఉన్న రాము తన కొద్ది మంది పరిచయస్థులను పలుకరించడానికిష్టపడలేదు. అలాంటి అవకాశం రాకుండా జాగ్రత్తగా తప్పించుకొంటున్నాడు. రాము ముఖంలో స్పష్టాస్పష్టమైన ఆనందం గోచరిస్తుంది.

ఒకప్రక్కగా ఒదిగి కూర్చున్నప్పటికి వధూవరులను స్పష్టంగా చూడగలుగుతున్నాడు రాము. వారి మనస్సులను గూడ అర్థం చేసుకోగలిగాడు ఏదో తనకు తెలీని సంతృప్తి కలుగుతూంది.

వెంటనే కట్నాలు, కానుకలు ఇచ్చేవాళ్లు ఇవ్వొచ్చునని తెలియజేయబడింది.

పెళ్లికి వచ్చిన వాళ్ళందరు రకరకాల కానుకలు చదివిస్తున్నారు.

ఆసందడిలో ఎలాగో సందుచేసుకొని మెల్లగా తానుతెచ్చిన అమూల్యమైన కానుకను జాగ్రత్తగాఉంచి వచ్చేశాడు రాము. అంతవరకు తన హృదయంలో భయం ఆవహించి వేధిస్తూంది. అదృష్టవశాత్తు ఏ ఆటంకమూ కలుగలేదు. లోలోపలే భగవంతుడికి నమస్కరించాడు రాము. పెళ్లికుమారుడు విజయకుమార్‌కి కానుక ఇవ్వగలిగాడు. హృదయం కుమిలి

పోతున్నా ఆనందబాష్పాలతో బయటికి వెళ్ళిపోయాడు తన కర్తవ్యాన్ని నిర్వర్తించాననట్లు రాము.

పెళ్ళికి వచ్చినవాళ్ళలో చాలమంది విజయకుమార్‌తోను, వాళ్ళ నాన్నతోను సెలవు తీసుకొని అభినందిస్తూ వెళ్ళారు.

మిగిలినవాళ్ళు పెళ్ళి భోజనానికులై ఉండిపోయారు.

పెళ్ళికానుకలను విజయకుమార్ తరపున స్వీకరించిన ఒక మిత్రుడు వాటన్నింటికి తాను తయారుచేసిన జాబితాను, అవకాశం చూసుకొని అందిస్తూ చిరునామాలేని ఒక కానుకను చూపెట్టాడు విజయకుమార్‌కి. అన్నింటికి ఉన్న చిరునామా దీనికి లేకపోవడం తమాషాగానే తోచింది విజయకుమార్‌కి.

ఆ కానుకను విజయకుమార్ దగ్గరకు తీసుకొచ్చి పెట్టాడు మిత్రుడే. విజయకుమార్ చూశాడు.

తగినంత పొడవు, వెడల్పు, ఎత్తుగల పెట్టెలాంటిది వల్చటి తెల్లని గుడ్డ చుట్టబడిఉంది.

ఇంతలో కొందరు చుట్టుముట్టారు.

ఆదుర్దా, ఉత్సుకత విజయకుమార్‌లో అధికమయ్యాయి.

మిత్రుడు విజయకుమార్ ముఖంలోకి చూశాడు.

అనుమతించినట్లు తలూపాడు విజయకుమార్.

ఈ విషయం గుర్తించిన మిత్రుడు ఆ పెట్టెలాంటి దానిపైని చుట్టబడిన గుడ్డ విప్పదీశాడు. పెట్టెలోని పొత్తిళ్ళలో చిన్ని పసికందు కంటబడింది. పెట్టెపైభాగంలో మూతలేకుండా పసిపాప ఊపిరి సలపడానికి తగినట్లు ఏర్పాటుఉంది.

పరవాలేదు. నేను పంపిన ఉత్తమమైన కానుకను స్వీకరించకుండా తిరస్కరించకండి.

నాకోసమై మీరు తాపత్రయపడకండి. మీకు నాకానుక, నా ఉత్తరం చేరేసరికి నా ప్రాణవాయువులు అనంతవాయువుల్లో లీనమైపోయి ఉంటాయనీ, నేను పంపిన అమూల్యమైన కానుక, జీవితాంతం నన్ను మరచిపోని కానుక_మీరు గుర్తుగా స్వీకరించండి ! ఆదరించండి !

నా చిట్టచివరి హృదయపూర్వక నమస్కారం అంగీకరించండి !

ఇట్లు మీ
జయ"_

ఉత్తరం చదవడం పూర్తిచేసింది అనసూయ. కన్నులు నిండుకొన్నాయి. మనస్సు కరిగింది, పరిస్థితులు అవగాహన చేసుకొంది బాగా ఆలోచించింది. బాధాతప్త హృదయంతో కుమిలిపోతున్న భర్త విజయకుమార్‌ని ఉద్దేశించి "ఏమండీ" అంది అనసూయ.

విజయకుమార్ తలెత్తి బిడియంగా అనసూయ ముఖంలోకి చూశాడు బెదురుబెదురుగా.

"జరిగిందేదో జరిగిపోయింది. ఆతల్లి ఆత్మశాంతికి, స్మృతిచిహ్నంగా ఈ బాబుని మన ప్రథమ సంతానంగా పెంచుకొందామండీ" అంటూ పెళ్ళికూతురుగా మస్తాబుచేసినప్పటి పారాణిగూడ ఆరని అనసూయ ఆ పసికందుని ఒళ్లోకి తీసుకొంది ప్రేమపూరిత హృదయంతో.

అనసూయ ఔన్నత్యాన్ని అభినందిస్తూ, అంగీకారసూచకంగా తలూపాడు విజయకుమార్.

అనసూయ పాలసీసాలోని పాలు పడుతూండగా ఒళ్ళో అమాయకంగా చిరునవ్వులు చిందించాడు చిట్టిబాబు ! !

# ఎందరో నాలాగ

ఏడెనిమిదేళ్ళ కుర్రాడు 'అమ్మా అమ్మా' అంటూ దొర్లుతున్నాడు కుక్కి మంచంలో. సమాధానం చెబుతూంది రాములమ్మ. బాబుకు ఎవరో బహుమతిగా ఇచ్చిన కిడ్డీ బ్యాంక్ బొమ్మ మర తిప్పితిప్పి చివరికి విజయం సాధించింది రాములమ్మ. అందులోని చిల్లర లెక్క పెట్టగా రెండు రూపాయల డెబ్భై పైసలు తేలింది. ఇరవై మూడు పైసలందులోనే ఉంచి రెండు రూపాయల యాభై పైసలు, తిరిగి తిరిగి అవురావురుమంటూ వచ్చిన భర్త చేతికిచ్చింది, డాక్టరు రాసిచ్చిన చీటీతోపాటు, బిళ్ళలు తెమ్మని పురమాయించింది. రామకోటయ్య అర్థం చేసుకొన్నాడు - బాబు జ్వరంతో మెలికలు తిరిగి పోతున్నాడు నుదుటిమీద చెయ్యివేసి చూసి తెలుసుకొన్నాడు. వెంటనే లగెత్తుకుపోయాడు. రాములమ్మ బాబుని కాస్త చూస్తుండమని ప్రక్కింటి మామ్మతో చెప్పి గొప్పవారింట్లో పనిచేయడానికి వెళ్ళింది అప్పటికే ఆలస్యమైందంటూ

'అమ్మగారండి తలుపు తలుపండి' - అని కేకేసింది రాములమ్మ. "ఓహో రాణీగారా! ఇప్పటికి తీరికైందా! అయినా మిమ్మల్ని అనే పని లేదు. తప్పు మాదే! మీదేం పోయింది అప్పనంగా నెలాఖరుకు అందుకుంటారుగా జీతం? అప్పుడప్పుడు ముందే అదని ఇదని పుచ్చుకుంటూనే ఉంటారాయె. ఇంకా నేను ఆస్పత్రికెళ్ళాలి అబ్బాయికెలా ఉందో! కానీ..........!" అని మామూలు ధోరణిలో ఆ సంపన్నురాలు కేకలు పెట్టింది. "మా బాబుకు జరంగా ఉందండి. అందుకే కాస్త ఆలస్యమైందండి" అంది రాములమ్మ "అవునవును. ఇది మామూలు పాటేగా! నేను అన్నాను గదా అని నీవు అదే అంటావు! సరే మీతో వేగలేం తొందరగా కానీ...." అంటూ చరచర వెళ్ళిపోందావిడ.

రాములమ్మ తండ్రి వ్యాపారంచేసి చితికిపోయి బ్రతికి బయటపడ్డ వాడు. రాములమ్మ అంతో ఇంతో చదువుకొంది. అపురూప సౌందర్యవతి కాకపోవచ్చు, అనాకారి మాత్రం కాదు. యౌవనంలో చూడముచ్చటగా ఉండేది. తన దూరబంధువుల్లో ఒకడు రామకోటేశ్వరరావు. ఆస్తిపాస్తులు లేవు. నావారన్న వారు ఎవరూ లేరు. ఒక ఫ్యాక్టరీలో పనిచేస్తూ నాలుగు రాళ్ళు సంపాదిస్తున్నాడు అతనికిచ్చి తన గౌరవానికి తగినరీతిగా రామేశ్వరికి వివాహం జరిపించాడు వాళ్ళ నాన్న.

కొంత కాలం బాగానే గడిచిపోయింది. సావాసగాళ్ళతో తాగుబోతై పోయి, ఆరోగ్యంచెడి, ఉద్యోగం పోగొట్టుకొన్నాడు రామకోటేశ్వరరావు. తరువాత రామకోటయ్య అయిపోయాడు. ఈ తాగుబోతుకి మళ్ళీ ఉద్యోగం దొరకలేదు. అనారోగ్యంతో మంచం పట్టాడు. ఇంతలోపల ఇద్దరు బాబులు పుట్టిపోయారు రాములమ్మకి, మూడో సంతానం జ్వరంతో బాధపడుతున్న బాబు మూడో సంతానంతోనే భర్త అంగీకరించకపోయినా తరువాత సంతానం కలుగకుండా ఆపరేషన్ చేయించుకొంది రామేశ్వరి - కాదు - ఇప్పటి రాములమ్మ చాల తెలివిగలది గొప్పవాళ్ళ ఇళ్ళలో అంట్లుతోమి, పాచిపని చేసి సంసార సాగరాన్ని ఈదుతోంది. క్రమంగా రామకోటయ్యకి కొంత స్వస్థత చిక్కినా తాగుడు మానుకోలేకపోయాడు ఈ తాగుడువల్ల అనేక అనర్థాలు, అతనికి ఆరోగ్యం చెడిపోవడమే గాక రాములమ్మకి మానసిక రుగ్మత కలిగింది. సంపాదకుడసలే కాలేకపోయాడు. రాములమ్మ సంపాదనతో జీవించడంతోపాటు తాగుళ్ళకు పీడిస్తూనే ఉంటాడు దీనివల్ల రకరకాల అల్లర్లు అయినా ఎంతో శాంతంతో, సహనంతో సంసారాన్ని లాగిస్తూంది రాములమ్మ. రామకోటయ్య మాత్రం తన సావాసగాళ్ళని, అలవాట్లని వదులుకోలేకపోయాడు. తాగుడు మానుకొంటున్నానని ఎన్నిసార్లు మాటిచ్చినా నిలబెట్టుకోలేకపోయాడు ఈ

మధ్యనే కాస్త బుద్ధిగా ఉంటున్నాడనుకొంది రాములమ్మ కొంత ఊరటతో. దాంపత్య జీవితాన్ని సుఖంగా, హాయిగా గడిపింది రాములమ్మ కొంత కాలం ఈనాటి స్థితిని పోల్చిచూస్తే హస్తిమశకాంతరం అద్దె ఇంట్లో అయినా సుఖంగా కాలం గడుపుతూ వచ్చారు రామకోటయ్య ఉద్యోగం ఊడిపోయాక ఈపాక గతి అయింది సూర్యచంద్రులు, వాయుదేవుడు ఈ పాకలోనే ఉంటారు. వర్షం కురిస్తే సరేసరి అతుకుల బొంతలలో గడిచీ గడవని సంసారం సాగదీస్తూంది రాములమ్మ

అమ్మగారినడిగి తెచ్చుకొన్న చిల్లర డబ్బులు పమిటలో ముడేసుకొంటూ ఇంటికి అగేతు స్తూ ఉంటే దారిలో జనం గుమిగూడి ఉన్నారు. ఏమిటా అని చూస్తుండగా రాములమ్మ తమ్ముడు పరుగునవచ్చి జరిగిన సంగతి చెప్పాడు

బాబు మందులకోసం ఇచ్చి పంపిన డబ్బుతో తప్పతాగివచ్చి రోడ్డున పడ్డాడు రామకోటయ్య తోడు వాని బాల్యస్నేహితుడు, మరో తాగుబోతు ఉన్నాడు. చాలా సిగ్గేసింది రాములమ్మకి చుట్టూచేరిన జనాన్నిచూసి. వెంటనే పెనిమిటి దగ్గరికెళ్ళి ఇంటికి రమ్మని బతిమాలింది.

'నన్ను తాకకు నేను అమృతం తాగాను. స్వర్గ సుఖంలో ఉన్నా. నీవెవరు? రంభా? మేనకా? ఎవరు? ఎవరైనా వన్నంటకు. నా రాములమ్మని తప్ప ఎవరిని తాకలేదు. రాముడు నా గురువు ఒకే ఆడది, ఒకే మాట. సీతమ్మ అయినా లంకకు చేరపోయింది. సీతమ్మకంటె నా రాములమ్మ పతివ్రత. దూరం దూరం తాకకు' అంటూంటే ఓపక్క సిగ్గు, మరోపక్క బాధ, ఇంకొకవక్క ఏడుపు — ముప్పిరిగొని రాములమ్మ ఉక్కిరి బిక్కిరయి పోయింది. వెంటనే తమ్ముడినీ, బాబాయినీ, అన్నలనీ ప్రురమాయించింది ప్రార్థించింది. వెంటనే వాళ్లు మూడు బిందెల నీళ్ళతో వడేం

స్నానం చేయించారు. దిగలేదు మత్తు. వెంటనే రాములమ్మ కోరికతో తమ్ముడూ, బాబాయి, అన్నాయిలు జబ్బపట్టుకొనిలాక్కెళ్ళి పాకలోని మరో కుక్కిమంచంలో పడుకోబెట్టి వెళ్ళిపోయారు రామకోటయ్యని. తమ్ముడిచేతికి డబ్బిచ్చి పంపించింది రాములమ్మ బాబు మందుకోసం

జ్వరంతోబాటు విలవిలలాడిపోతున్నాడు మూలుగుతున్నాడు. తడి గుడ్డ నుదుటిమీద పెట్టింది రాములమ్మ దొల్లుతూఉండడంవల్ల గుడ్డ నిలవడం లేదు. నుదుటిమీద. అలా కొంతసేపు పట్టు కూర్చుంది. రాములమ్మ బాబుని అనునయిస్తూంది.

మందుమత్తు వదలిపోయాకా మామూలు మనిషయ్యాడు రామకోటయ్య. గుడ్డలంతా తడిసి చలిచలిగాఉంది ఏమిటా అని ఆశ్చర్యపోయాడు. ముందటివిషయం గుర్తుకువచ్చింది. బాబు మందులకోసం వెళుతుండగా తన బాల్యస్నేహితుడు కల్లుపాకకు బలవంతంగా తీసుకుపోవడమూ, అక్కడ వాని బలవంతంతోనే ఒక పెగ్గంటూ తెగ తాగడంవరకూ గుర్తుంది తరువాత సంగతి ఏమైఉంటుందో గ్రహించాడు అడిగాడు భార్యని. రాములమ్మ పూసగుచ్చినట్లు చెప్పింది జరిగినసంగతి. కోపోద్రిక్తుడయ్యాడు రామకోటయ్య ఇంత అవమానం బజార్లోచేస్తుందా ! అంటూ బుసలుకొడుతూ పాకలో మూలనఉన్న కొడవలితెచ్చి నరుకుతానంటూ చంపుతానంటూ మీదికిమీదికి వచ్చాడు బాబు జ్వరంతో ఒకచేపు వెంపలు పడుతు బొబ్బరిస్తున్నాడు. అయినా లెక్కచెయ్యలేదు రామకోటయ్య. అవమానంతో క్రుంగిపోయిన తనకి కోపం కట్టుతెంచుకొనిపోంది తాగి తనమాన ఉంటే ఉంటాడు బజార్లో అందరిఎదుటా బిందెతో నీళ్ళుపోయిస్తుందా ! ఛీ ! ఛీ ! ఎంత అవమానం! గుర్రుమి బలాన్నంతా పుంజుకొని నరకడానికి ఉద్యమిస్తున్నాడు! రాములమ్మ బెదరలేదు బెదరలేదు. ఆమెఆత్మశక్తి అలాంటిది, ఎంతకాలమని అణిగిమణిగి ఉండడం ! తన రెక్కాడితే

గాని ఇంటిల్లిపాది దొక్కాడదు. ఆ విషయం మరచిపోయి తనని వరక దానికి వస్తున్నాడీ మగరాయుడు సిగ్గులేక అనుకొంటూ గుండె దిటవుతో ఉంది.

ఎప్పుడూ భర్తతో పల్లెత్తు మాటలాడని రాములమ్మకి కోపం వచ్చింది. దిగమింగుకొంటూ 'బలి పశువులా మెడవంచుకొనే రోజులు పోయాయి. మెడవంచితే చంపగలవు. కానీ సేవలా చేయను. స్త్రీ శక్తి స్వరూపిణి అనే సంగతి మరువకు. నీ చేతిలోని కొడవలి తిప్పిపారేయ లేననుకోకు. నీవే గ్రహిస్తే మంచిది, నా రెక్కల కష్టంతో ఇలా వెళ్ళదీస్తున్నాను సంసారాన్ని. బాబు జ్వరంతో విలవిలలాడి పోతూంటే మందుల కోసం డబ్బులు ఇచ్చి పంపితే తప్పతాగి, పై పెచ్చు చంపడానికి ప్రయత్నించడం నీకే తగింది. చాలా బాగుంది. చంపు చంపు – అంటూ మీరు లొంగితే పురుషాధిక్యాన్ని చలాయిస్తూనే ఉంటారు మగవాళ్లు సేవలా ఉనడం లేదు. ఇల్లూ ఒళ్లూ గుల్లచేశావు శాంతి సుఖం లేవు. పైగా ఈ రభస' అంటూ బాబుని సముదాయిస్తూ ఉంది రాములమ్మ. తనను లెక్క చెయ్యడంలేదని రామకోటయ్య కోపం ఇబ్బడి ముబ్బడి అయింది. వణికి పోతున్నాడు. మొగం కందగడ్డలా తయారైంది. నుదుటిపై ముడతలు పడ్డాయి. పెదవులు వణికిపోతున్నాయి.

ముచ్చెమటలు పోశాయి. మాటమాత్రం పెగల్లేదు. వరకదానికి చెయ్యి వంగడం లేదు. చిత్రంలోని బొమ్మలా ఉన్నాడు రామకోటయ్య. కోపం చల్లారలేదు. పై పెచ్చు పెరుగుతోంది కారణం రాములమ్మ తనని లక్ష్యం చేయకపోవడమే. తప్ప వరికి పోగులుపెట్టాలన్న కోరిక, ప్రతీకారం తీర్చుకోవాలన్న వాంఛ మరీమరీ పెరిగిపోతున్నాయి. ఐనా రాములమ్మ మాత్రం లెక్కచెయ్యలేదు. ఏమీ జరగనట్లే ఉండిపోయింది. పెరప

లేదు. పైగా బాబు గురించి ఆలోచిస్తోంది. మందుకోసమని వెళ్ళిన తమ్ముడింకా రాలేదే అని చింతిస్తూంది.

తన పూర్వస్థితి, ఈనాటి దుస్థితిని గూర్చి చెప్పింది. ఎంతో సుఖంగా, హాయిగా కాలం గడిపింది గుర్తుకుతెచ్చింది. ఏ స్థితిలో చిల్లర చేతిలోపెట్టి బాబుకు నీళ్ళు తెమ్మనిందో జ్ఞాపకం చేసింది. అంతే తప్ప భర్త తనను నడుపుతాడన్న విషయాన్ని లెక్క చెయ్యలేదు. అలాంటి స్థితిలోంచి భర్త ఏ స్థితిలోకి వచ్చిందీ వివరించింది. తన రెక్కల కష్టంమీద బతుకుతున్న సంగతి అతనికి స్పష్టం చేసింది. భర్త గౌరవమే తన గౌరవమనీ, కుటుంబ గౌరవమనీ సున్నితంగా చెప్పింది. అంతే. అర్థం చేసుకొన్నాడు చేతిలోని కొడవలి జారిపోయింది. నిశ్చేష్టుడైపోయాడు రామకోటయ్య. కొయ్యబారిపోయింది దేహం. నోట మాటలేదు. చివాలున ఒక మూలలో కూలబడి నెత్తిన చేతులు పెట్టుకొని సన్నగా దుఃఖిస్తున్నాడు. తన్ను తాను అసహ్యించుకొన్నాడు. ఎంత ఘోరం జరిగిపోయేది! అతనిలోని రాక్షసుడు చచ్చిపోయాడు జరిగిపోయిందానికి సిగ్గుపడుతున్నాడు. తమ్ముడు మందు తెచ్చి ఇచ్చాడు. ఎవరు మాట్లాడటం లేదు. రాములమ్మ బాబుకి మందివ్వడంలో నిమగ్నమయింది. బావ సంగతి తెలుసుకొన్నాడు రాములమ్మ తమ్ముడు. సంతృప్తి చెందాడు. సంతోషంగా బయటకెళ్ళాడు. ఈ పవిత్ర భారతావనిలో ఇలాంటి భర్తలతో వేగుతున్న నాలాంటి అభాగినిలెందరో! అంటూ నిట్టూర్చింది రాములమ్మ.

# మొదటి రాత్రి

కళా పిపాసువులందరూ 'చిత్రా బహుమతి' ఫలితాల కోసం ఎదురు చూస్తున్నారు. ఈ బహుమతి తప్పకుండా ఈనాడు చాల ప్రసిద్ధ చిత్రకారుడు ఆర్. ఆర్. రాగులకే వస్తుందని అందరూ ఆశిస్తున్నారు. అతి త్వరలోనే ఇది తేలిపోతుందని అనుకొంటున్నారు. ప్రముఖాంధ్ర చిత్రకారుడు ఎన్. ఆర్. చిత్రా స్మృత్యర్థం పారిశ్రామికవేత్త 'చిత్రా బహుమతిని' ఏర్పాటుచేశాడు. ఈ పారిశ్రామికవేత్త ఎన్. ఆర్. చిత్రా దూర బంధువుల్లోని వాడు. తన ప్రేయసి పేరుకూడ చిత్ర. చిత్ర జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని ఏటేటా బహుమతిని ఇవ్వదలచి 'చిత్రా బహుమతిని స్థాపించాడు. వాటర్ కలర్‌లోగాని, ఆయిల్ పెయింట్‌తో గాని చిత్రించిన చిత్రాలను ఎంట్రీకోసం ఆహ్వానిస్తుంది 'చిత్రా బహుమతి' సంస్థ. వచ్చిన ఎంట్రీలలో ప్రప్రథమ స్థానాన్ని పొందిన చిత్రానికి బహుమతి నిస్తారు. ఈ బహుమతి విలువ పదివేల రూపాయల నగదు.

ఆర్. ఆర్. రాగుల అప్పటికే ప్రసిద్ధిపొందిన చిత్రకారుడు. స్వదేశీయులైన దామెర్ల రామారావు, పి. ఎన్. వెంకట్రావు, అడవి బాపిరాజు, ఎన్. ఆర్. చిత్రా, టి. ఎ. పద్మా మొదలైన చిత్రకారులు, కార్టూనిస్టు తలిసెట్టి రామారావు, భారతీయ చిత్రకారుడు రవివర్మ, కొండపల్లి; సమకాలిక చిత్రకారులు పి. టి. రెడ్డి, ఎ. పైడిరాజు, కె. రాజయ్య, మంగళగిరి శ్రీ సత్యం, శేషగిరిరావు, బాపు, శంకర్, శీలావీ, సంజీవ్‌దేవ్ మొదలైన వారినీ, వారి చిత్రకళా నైపుణ్యాన్నీ, ఒడుపులనీ, మెళకువలనీ బాగా గుర్తించినవాడు ఆర్. ఆర్. రాగుల. పైగా భారత ప్రభుత్వం ఏర్పాటు చేసిన ఫెలోషిప్పుతో బొంబాయి స్కూల్ ఆవ్ ఆర్ట్ అండ్ ఆర్కిటెక్చర్‌లో సర్వప్రథముడుగా ఉత్తీర్ణుడై ఆంధ్రప్రదేశ్‌కేగాక యావద్భారతానికే

ఖ్యాతిదెచ్చిన సాటిలేని మేటి చిత్రకారుడు. చదువు ముగిశాక ఢిల్లీలో కొంతకాలం చిత్రకళను ప్రాక్టీస్‌చేశాడు. అది అంతగా నచ్చక మకాం హైద్రాబాద్‌కి మార్చాడు.

మొదటినుంచీ దిక్కులేని వారంటే, నిరుపేదలంటే, ముదుసలి ముదుకలంటే రాగుల హృదయం కదిలిపోయేది. కరుణరసం పెల్లుబికేది. లంబాడీలు కష్టజీవులు. నాగరికతంటే తెలియనివాళ్ళు లంబాడీలు. అలాంటి లంబాడీలకష్టాల్ని గమనించిన రాగుల లంబాడీస్త్రీ బొమ్మను చిత్రించి ఆరంభ దశలోనే తన కళాప్రతిభని ప్రకటించుకొన్నవాడు. హైద్రాబాద్ కళా భవన్‌లో ఆంధ్రప్రదేశ్ లలితకళా అకాడమీ ఏర్పాటుచేసిన చిత్రకళా ప్రదర్శనలో ప్రథమబహుమతికి నోచుకొంది ఈ లంబాడీ లతాంగిచిత్రం. దాంతో మేటి చిత్రకారుడుగా రాగులకు పేరు రావడంలో అత్యుక్తిలేదు. ఆదే సందర్భంలోనే 'లంబాడీ లతాంగి' చిత్రాన్నిచూసి ముగ్ధురాలైన ఒక సంపన్న కుటుంబానికిచెందిన నవయువతి తన చిత్రాన్ని చిత్రించమని రాగులను అభ్యర్థించింది. ప్రతిఫలంగా ఎంతడబ్బైన ఇస్తానంది. కాని ఇది గిట్టని రాగుల తిరస్కరించాడు. ఖిన్నురాలై వెళ్ళిపోయింది ఆయువతి

* * *

ఒకానొక ఉదయం రాగుల ఇంటిముందు ఒక ముదుసలి బిచ్చగత్తె కనిపించింది. వంకరటింకరైన పాత కళ్ళజోడు, చాలీచాలని అతుకులబొంత పైన, ఎడమచేతిలో ఊతకర్ర. కుడిచేతిలో బొచ్చె గూనువంగి గజగజ వణికిపోతూంది చూచిన మరుక్షణమే రాగుల ఆ మోడల్‌ని గ్రహించి బొమ్మ చిత్రించాడు. ఆ చిత్రిస్తూన్నంతసేపు అక్కడే ఉండిపోయింది ఆ ముసల్ది. తుది మెరుగులకోసం చిత్రాన్ని తన గదిలోకి పట్టుకెళ్ళాడు తానెంతో విజయం సాధించినట్లు భావిస్తూ. ఇదే సమయంలో ఆ ముదుసలి

అంతగా వణికిపోతున్నదల్లా దగ్గరలోనే ఆగివున్న కారులోనెక్కి తుర్రున వెళ్ళిపోయింది. ఆ ముదుసలి మనిషి తాలూకు సంగతులు అరాతీద్దామన్న ఆదుర్దాతో లోపలనుంచి వచ్చాడు రాగుల. కానీ అక్కడ ముసలిదాని ఆచూకీలేదు. ఆశ్చర్య చకితుడయ్యాడు. తాను హైద్రాబాద్‌లో వున్నా డన్నమాటేగాని ఎక్కడో వనస్థలిపుర శివార్లలో ఉంటున్నాడు. తానున్న చోట జనసమ్మర్దంగానీ, సిటీ హడావిడిగానీ ఉండదు. ఎంతో ప్రశాంతంగా తన చిత్రరచనకు ఉపకరించే చోటుఅది. అక్కడ ఎవరూలేరు అడిగితెలుసు కొందామంటే. అలా వుండిపోయాడు ఆలోచిస్తూ.

కళాభవన్‌లోని ఆంధ్రప్రదేశ్ లలితకళా అకాడమీవక్షాన ఏటేటా జరిగే చిత్రకళా ప్రదర్శనలో కళాపిపాసులు అందరినీ అత్యంతం ఆకర్షిం చిన చిత్రం 'ముసలిది'. వార్తాపత్రికలన్నీ దీని విశిష్టతని సవిమర్శకంగా చాటాయి. ఎంతోమంది తనివితీరా ఆచిత్రాన్ని దర్శించి మెచ్చుకొన్నారు. ప్రశంసల పరంపరలు, రాగుల చిత్ర కళానైపుణ్యాన్నిగూర్చి అనేకం వచ్చాయి. ఈసారిగూడా ప్రథమ బహుమతి రాగులచిత్రం 'ముసలిది'కే దక్కింది. అకాడమీ బహుమతితోపాటు ఎందరో చిత్రకళాభిమానులు ముగ్ధులై ఉడుతాభక్తిగా తమకు తోచినంతగా వ్యక్తిగత బహుమానాలు ప్రక టించారు. అదేరీతిని ఓ యువతి తనకోరిక ఈవిధంగా తీరిందనీ, ఈచిత్రా నికి వ్యక్తిగత బహుమతిగా పదివేలు రూపాయలు చెక్కు స్వీకరించవల సిందని కోరింది రాగులను. అంతా గుర్తువు తెచ్చుకొన్నాడు రాగుల. అర్థం చేసుకొన్నాడు. క్షణం ఆలోచించి ఓనిర్ణయానికి వచ్చినట్లు తలూపి ఒక షరతుకు అంగీకరిస్తే తాను బహుమతిని స్వీకరిస్తానన్నాడు రాగుల. ఆ యువతి సిద్ధమేనంది. 'మోడల్'గా ఉండే పక్షంలో దాన్ని స్వీకరిస్తా నన్నాడు చిత్రకళమీద అభిమానమేకాదు, అభినివేశమున్న ఆ యువతి అదే మహద్భాగ్యంగా భావించి రెండో ఆలోచనలేకుండానే అంగీకరించింది.

అతను చెక్కు స్వీకరించాడు. ఆవిధంగా వారిద్దరూ దగ్గరయ్యారు. ఆ యువతివి మోడల్‌గాచేసి ఎన్నెన్నోరకాల బొమ్మలు చిత్రించి జాతీయం గానేగాక అంతర్జాతీయంగాను ప్రఖ్యాతిపొందాడు రాగుల.

నిరుపేదగా జీవితాన్ని గడుపుతూన్న రాగుల అనుకోకుండా అనంత మైన ఆ ఆస్తిపాస్తులకు వారసుడయ్యాడు తన ఆస్తినంతా కాజేయాలన్న తలంపుతో మోసంచేసిన దాయాదులపై కోర్టులో కేసుపెట్టి గెల్చిన తనకు మిగిలిన తాత మరణంతో ఆ ఆస్తంతా రాగులకు సంక్రమించింది. ఆ పై అతి మాయిష్కోసమైతేనేమి, ఇతరత్రా కారణాలవల్లనైతేనేమి తెలుగునాడు పడిబొడ్డు అయిన గుంటూరుకు మకాంమార్చాడు రాగుల. తనవారంటూ ఎవరూలేని లావణ్య 'మోడల్'గా ఉండడానికే నిశ్చయించుకొంది గనుక రాగులతోపాటు గుంటూరు వచ్చేసింది. తనకు వలసినంత డబ్బులంతా ఫిక్సెడ్ డిపాజిట్లలోఉంచి తల్లిదండ్రులు వ్యాపారంలో సంపాదించిన ఆ ఆస్తినంతా లావణ్యకు సంక్రమించేలాచేసి వెళ్ళిపోయారు. తాను గుంటూరుకు వస్తానంటే వద్దనలేదు రాగుల. పైపెచ్చు సంతోషించాడు.

గుంటూరులో లక్ష్మీపురంలో చక్కటి డాబాభవనం. విశాలమైన ప్రాంగణం అందులో తీర్చిదిద్దినట్టున్న తోట. రకరకాల పూలమొక్కలు. తమ్మెలువిందు చేస్తున్నాయి. పుష్పసుగంధం నాసాపుటాల్లో ప్రవేశించి మామూలు వ్యక్తులే మత్తెక్కిస్తూంది డాబాలో హాల్లో తన రకరకాల చిత్రాల్ని కళాత్మకంగా అమర్చిపెట్టాడు రాగుల. ఒకపక్కగా లావణ్య శిక్షణపొందుతూ చిత్రించిన చిత్రాలున్నాయి. హాలుకు ఒకపక్క పడకగది. దాన్నానుకొని డ్రెస్సింగురూమ్. మరోప్రక్క చిత్రకళకు సంబంధించిన సామగ్రితో నిండినగది. హాల్లో ఒకమూలగా చిత్రాలు చిత్రించడానికి కేన్వాసు అమర్చినబోర్డు. రంగులు, కుంచెలు మొదలైన చిత్రకళా సంబంధించి సామగ్రి ఏర్పరచినబల్లలు, ఎదురుగుండా 'మోడల్' ఉండడానికి

తగినవేదిక అన్నీ ఏర్పాట్లు కళాత్మకంగా చేయబడిఉన్నాయి. అందులో ప్రవేశించిన వాళ్ళెవరైన అవున్నంతసేపు ఒక కళాజగత్తులో విహరిస్తున్నట్టుఅనుభూతిని పొందుతారు. అందరినీ ఆకర్షించే రెండు కళాఖండాలు: ఒకటి లంబాడీలతాంగి, రెండు ముసలిది. ఈరెండు తైలవర్ణచిత్రాలు. స్కెచ్ గీయడంలో, వాటర్ కలర్ సమ్మేళనం చేయడంలో, తైలవర్ణాల్ని తీర్చిదిద్దడంలో రాగులకు రాగులేసాటి. అనంత కళావిజ్ఞానఖని రాగుల.

రాగుల తల్లి ప్రేమకు నోచుకోలేదు. తన జననమూ, తల్లి మరణమూ ఒకేసారి జరిగిపోయాయి. తన బాల్యంలోనే తండ్రి గతించగా తాత పెంచి పెద్దచేశాడు. అలా పెరిగిన తనకు 'శకుంతల' అంటే ప్రత్యేకమైన అభిమానం. శకుంతల పేరెత్తితే తన హృదయం ద్రవిస్తుంది. ముగ్ధ సుకుమార అయిన శకుంతల తపోవనంలో చెలికత్తెలతో మొక్కలకు నీళ్ళు పోస్తూన్న చిత్రాన్ని చిత్రించాలని ఎంతో కాలంగా ఆశిస్తూ వచ్చాడు. ఈనాడు 'చిత్రా బహుమతి' కోసం ఆ చిత్రం చిత్రించాలని సంకల్పించాడు. తగిన మోడల్ లావణ్య వుంది గనుక తన కోరిక సిద్ధిస్తూందని, తప్పక తన పేరు మరోసారి మార్మోగి పోతుందని భావించాడు. చిత్ర రచనకు సర్వం సిద్ధం చేసుకొన్నాడు. 'మోడల్'గా శకుంతల వేషంలో లావణ్య డ్రెస్సింగ్ రూమ్‌లోనుంచి ప్రత్యక్షమైంది. ఆ ముగ్ధ మోహనాకార, అతిలోక లావణ్య లావణ్యను చూచిన రాగుల హృదయం రాగరంజితమైంది. ఎంతమంది యువతుల్ని చూడలేదు తాను. పైపెచ్చు మోడల్‌గా లావణ్య కొంత కాలంగా ఉంటూ వచ్చిందే! అయినా ఈనాడు ఎందుకింతగా తన హృదయం ఆకృష్టమయిందా అని తలచే అవకాశమే లేకుండా పోయింది. తాహూహించిన శకుంతలలో ఉండవలసిన మరికొన్ని చిహ్నాల్ని లావణ్యకు దిద్ది తీర్చేపనిలో నిమగ్నుడయ్యాడు. కానీ తన మనసు మాత్రం తన వశంలోలేదు. అనంతానురాగ లోకాల్లో విహ

## అచ్చయిన రచనలు, విమర్శలు :

1. కోలాచలం శ్రీనివాసరావు నాటక సాహిత్య సమాలోచనము (పిహెచ్.డి సిద్ధాంత గ్రంథం)

2. క్షేత్రయ్య పదసాహిత్యం (ఆం.ప్ర. సాహిత్య అకాడమీ అవార్డు పొందిన గ్రంథం)

3. సారంగపాణి పదసాహిత్యం

4. ప్రసంగ సాహితి (రేడియో ప్రసంగవ్యాసాలు)

5. తెలుగుదేశపు జానపద గీతాలు

6. కోలాచలం శ్రీనివాసరావు

7. సాహిత్యోపన్యాసములు –17 ఉన్నవ లక్ష్మీనారాయణ శత జయంతి ప్రసంగం

8. సాహిత్యసుధ (వ్యాససంపుటి)

9. జానపద గేయరామాయణం

10. తెలుగు వాగ్గేయకారులు

11. సారంగపాణిపదసాహిత్య (హిందీ అనువాదం)

12. తెలుగులో పదకవిత (ఆం.ప్ర. సాహిత్య అకాడమీ అవార్డు పొందిన గ్రంథం)

13. జాతికి ప్రతిబింబం–జానపద సాహిత్యం

చిన్నపుస్తకాలు :

14. క్షేత్రయ్య

15. పురందరదాసు

16. నాగార్జునుడు

పాఠ్యపుస్తకాలు :

17. 8వ తరగతి ఉపవాచకం

18. 9వ తరగతి ఉపవాచకం

19. 10వ తరగతి ఉపవాచకం

20. కమర్షియల్ ప్రాక్టీసు, సెక్రెటేరియల్ కోర్సు, భాగము 1, 2 (ఇంటర్మీడియేట్ పాఠ్యపుస్తకం)

కవితలు

21. బాంగేయాలు

22. నవోదయం

కథలు

23. తీరినభయం

నవలలు

24. సుహాసినీహాసం (సాంఘికం)

25. రాజరాజ ప్రశస్తి (చారిత్రికం) (నాగార్జున విశ్వవిద్యాలయం బి.కాం. ఉపవాచకం)

ముద్రణలో

1. భాషావ్యాసాలు
2. తెలుగు నాటకం
3. వేయిపడగలు-విశ్లేష విమర్శ(విశ్వనాథసా అవార్డు పొందిన గ్రం
4. జానపదగేయాలు
5. తెలుగులో హేతువాద (వ్యాస సంపుటి)
6 విశ్వనాథనాటకాలు
7. పదకవితాపితామహ (నాటకం)



Dr. S GANGA

ver Printed at Sri Balanjaneya Printing Works, M